# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక

రిపబ్లిక్ సంచిక

వెల 4 అణాలు

25-1-1950




భారతదేశ ప్రజలమైన మేము భారతదేశమునొక
సర్వస్వతంత్ర ప్రజాస్వామ్య ప్రజాధిపత్య
రాజ్యముగా నిర్మాణముచేయుటకై ప్రమాణ
పూర్తిగా తీర్మానించినవారమై ఈ దేశ పౌరు
లందరకును న్యాయమును సాంఘికముగా,
ఆర్థికముగా, రాజకీయముగా; స్వాతంత్ర్య
మును భావములో, ప్రకటనలో, విశ్వాసము
లో, మతములో, ఆరాధనలో; సమత్వమును
ప్రతిపత్తిలో, అవకాశములో చేకూర్చుటకును,
ఈ దేశ పౌరులందరి యందు సౌభ్రాతృత్వమును
వ్యక్తిగౌరవమునకు, జాతీయైకమత్యమునకు
అభయమొసంగుచు పెంపొందించుటకును;
మా రాజ్యాంగపరిషత్తులో ఈ 1949 సం.
నవంబరు 26 తేదీని ఈ రీతిగా మాకు మేమే
ఈ రాజ్యాంగమును వర్తింపజేసికొని శాసించు
కొని స్వీకరించుచున్నాము.

# ఆంధ్రలో

## త్వరలో విడుదల కానున్నది

## శ్యామలావారి మహోజ్వల

చిత్రము



# ఇన్ బవల్లి

**అరవము**

(ప్రేమ, వినోదము, గగుర్పాటు కలిగించు ఉద్రేకఘట్టములతో కూడిన మనోహరమగు జానపదగాథ)

నటించినది.

**మహాలింగం, సరోజ, సరస్వతి, సామినాథన్, కృష్ణన్, మధురం**

తదితరులు

ఆంధ్ర, ఉత్తరహిందూస్థానమునకు డిస్ట్రిబ్యూటర్లు:

## ఆంధ్రఫిలింసర్క్యూట్

**గాంధినగర్, విజయవాడ.**




డిస్ట్రిబ్యూటర్లు:—

| ఆంధ్ర. సీడెడ్. నైజాంలకు: | మైసూరుకు: | ఇతరప్రదేశములకు: |
|---|---|---|
| పూర్ణాపిక్చర్సు, బెజవాడ. | యశోధరా ఫిలిమ్సు, బెంగుళూరు సిటీ. | శోభనాచలపిక్చర్సు లిమిటెడ్, మద్రాసు 18. |

# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక


---

## విషయానుక్రమణిక

**25 జనవరి 1950**

పుట:

# ఆంధ్రపత్రిక


సంవత్సరచందా
రు. 12-0-0
విడిపత్రిక
అణాలు 0-4-0

ప్రతిబుధవారము ప్రకటింపబడును.

సంపుటము **42**
సంచిక **21**


ఒరులేయవి యొనరించిన నరవర! యప్రియము తనమనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి పరాయణము పరమధర్మపథముల కెల్లన్.
(మహాభారతము)


**Founder : K. NAGESWARA RAO.**

విరోధి సంవత్సర మాఘ శుద్ధ సప్తమి. బుధవారము






ఆంధ్రపత్రిక

1950-వ సం॥ జనవరినెల 25-వ తేది బుధవారము

# స్వతంత్రభారత రిపబ్లిక్ అవతరణ

స్వాతంత్ర్యము, సమత్వము, సౌభ్రాతృత్వము; ఈ పవిత్ర లక్ష్యత్రయసాధనకు ప్రపంచ ప్రజలు శతాబ్దములుగ అవిరామపోరాటమును సాగించిరి. విశేషత్యాగములు చేసిరి. రక్తమును ధారవోసిరి. ప్రాణముల నర్పించిరి.

పరాధీనదేశముల స్వాతంత్ర్యోద్యమములు అన్నింటికి ఇవే లక్ష్యములైనవి. ప్రతి ప్రజాస్వామిక రాజ్యాంగమునకు ఇవే ప్రాతిపదికలైనవి. ప్రజలకు స్వాతంత్ర్యమును, సమత్వమును ప్రసాదింపని, సౌభ్రాతృత్వసాధనకు ఉపకరింపని రాజ్యాంగము, రాజ్యాంగమె కాజాలదు. ప్రజల ఆశయములను ప్రతిబింబించుచు, ఆ ఆశయసిద్ధికి ప్రయోజనకరమైన సాధనగ, నున్నదె సరియైన రాజ్యాంగము.

ఈ దృష్ట్యా, ఇకనుండి మన రాజకీయ, ఆర్థిక, సాంఘిక జీవితమును దిద్ది, అభ్యుదయమార్గమున భారతజాతిని ముందుకు గొనిపోవలసిన, నవభారత రాజ్యాంగమును పరిశీలించిన, విమర్శలకు ఆస్కారమున్నప్పటికిని అన్నివర్గముల వారికి సంతృప్తి కలుగగలదు.

1946 డిసెంబరులో భారతరాజ్యాంగపరిషత్తు ప్రథమముగ సమావేశమైనపుడు పరిస్థితులు అగమ్యగోచరముగ నుండెను. నవభారతరాజ్యాంగస్వరూప మెట్లుండునో ఊహించుటకైనను సాధ్యము గాకుండెను.

అయినను, తనలక్ష్యమును విస్పష్టముగ ప్రకటించుకొని ఆ లక్ష్యసిద్ధికి ఉపకరింపగల రాజ్యాంగమును తయారుచేయుటకు భారతరాజ్యాంగపరిషత్తు ఉపక్రమించెను. 1947 జూన్‌మాసములో దేశభవిష్యత్తు స్వరూపము నిర్ధారణమైనది. స్వాతంత్ర్యమును సంపాదించిన భారతజాతీయకాంగ్రెసు లక్ష్యించిన ఐక్య, అఖండభారతము అలభ్యమని స్పష్టమైనది. విభక్తభారతమును ఏకముచేసి దృఢమైన భారతమును నిర్మించుటకు పరిషత్తు పూనుకొనవలసివచ్చెను. తదనుగుణముగ లక్ష్యతీర్మానమును సవరించుకొనవలసిన అవసర మేర్పడెను.

భారతరాజ్యాంగపరిషత్తు ఈ గురుతరబాధ్యతను ప్రశంసనీయముగ నిర్వహించినది. మూడు సంవత్సరముల నిరంతరకృషిఫలితమే నవభారత రాజ్యాంగము.

భారతప్రజానీకము తన లక్ష్యమును పొందజాలకపోయిన అది రాజ్యాంగలోపము గాదు. ఆరాజ్యాంగమును అమలుచేయువారి సంకల్పము, ప్రవర్తనలె కారణమగును. అల్పసంఖ్యాకులకు అన్యాయము జరిగినదని ఆక్షేపించుటకు వీలులేదు. వెనుకబడినజాతులు తమకు తగిన రక్షణలు లేవని ఆందోళనచెందుటకు అవకాశము లేదు. నవభారతరాజ్యాంగనిర్మాత ఈ రెండు వర్గములకును ప్రతినిధి. అధికసంఖ్యాకవర్గము నవభారతరాజ్యాంగరచనాబాధ్యతను వీరి కప్పగించుటలో రాజనీతిజ్ఞతనెగాక తమ ఉదారస్వభావమును, ధర్మనిరతిని, విశాలదృక్పథమును ప్రదర్శించిరి. భిన్నవర్గముల నమైక్యతకు విరుద్ధదృక్పథముల సమన్వయమునకు ఇది తోడ్పడినది.

రేపు యావద్భారతమునకు మహాపర్వదినము. అఖిలాసియాకు చరిత్రాత్మకమైన రోజు. రేపు ప్రజలు ఈ "రాజ్యాంగమును మాకు మేమె వర్తింపజేసుకొని శాసించుకొని, స్వీకరించుచు సాంఘికముగ, ఆర్థికముగ, రాజకీయముగ న్యాయమును, భావములో, ప్ర

టనలో, విశ్వాసములో, మతములో, ఆరాధనలో స్వాతంత్ర్యమును, ప్రతిపత్తిలో, అవకాశములో సమత్వమును చేకూర్చుటకును, ఈ దేశపౌరు లందరియందు వ్యక్తిగౌరవమునకు, జాతీయైకమత్యమునకు అభయ మొసంగుచు సౌభ్రాతృత్వమును పెంపొందించుటకును" ప్రమాణము చేయుచుండిరి.

ప్రజలు ఇప్పటికి ఇరువదిసంవత్సరముల క్రితము భారతదేశమునకు సంపూర్ణస్వాతంత్ర్యమును సంపాదించుటకు ప్రమాణముచేసిరి. మహాత్ముని నాయకత్వమున ఆ ప్రమాణమును సఫల మొనర్చుకొనిరి. తిరిగి నేడు వేరొక ప్రమాణమును చేసి, ఆ ప్రమాణసాఫల్యము ఐక్య, నిర్విరామకృషిని ప్రారంభించుచుండిరి. గాంధి మహాత్ముని నాయకత్వము లేనందున గమ్యస్థానమును చేరగలమా? లక్ష్యము సిద్ధించునా? యను సందేహములు ప్రబలినవి.

ప్రజలు, ప్రజాప్రతినిధులు, ప్రభుత్వరథసారథ్యమును వహించు నాయకులు మహాత్ముడు నిర్దేశించిన మార్గమున, రాజ్యాంగము పేర్కొనిన లక్ష్యములను స్మృతిపథమునం దుంచుకొని, రాజ్యాంగము నిర్ణయించినట్లు ప్రభుత్వవిధానమును అవలంబించిన గమ్యస్థానము సమీపస్థము కాగలదు. లక్ష్యము అనతి కాలములోనే సిద్ధించును. నేటిప్రమాణము సఫలమగును.

భారత రిపబ్లిక్ అవతరణశుభసమయమున గతములో సాధించిన ఫలితములను ఆనందించుటతోనే తృప్తిచెందక వర్తమానకర్తవ్యమును, భవిష్యత్తు బాధ్యతను గ్రహించి, వాటినిర్వహణకు ఐక్యకృషి జరుపుటకు కంకణబద్ధులు కావలెను. అప్పుడె ఆసియా ప్రజలు భారతదేశముపై పెట్టుకున్న ఆశలను మనము తీర్చగలుగుదుము. ఆసియాజాతులలో అగ్రస్థానమును, అగ్రరాజ్యములలో సముచితస్థానమును భారతదేశము పొంద వీలగును. స్వాతంత్ర్యపోరాటమున ప్రాణము లర్పించిన యోధుల ఆత్మలకు శాంతిని చేకూర్చగలము.—జై-హింద్.





1949 నవంబరు 26 న పరిషత్తు రాజ్యాంగాన్ని ఆమోదించిన అనంతరం అధ్యక్షుడుగా డాక్టర్ రాజేంద్రప్రసాద్ రాజ్యాంగపత్రంపై సంతకం చేస్తున్న దృశ్యం.

# భారత రిపబ్లికన్ రాజ్యాంగం

శ్రీ ఎస్. సీతారామ్

"ఇప్పుడొక నూతన స్వర్గసీమ, ఒక నూతన ప్రపంచం మాకు సాక్షాత్కరిస్తున్నాయి. దౌర్జన్యం పశుబలవాదాల యుగం గతించి వెళ్లింది. హేతుయుక్తము, న్యాయబద్ధమయిన యుగం అవతరిస్తోంది. మహత్తర మానవవాదసిద్ధాంతాలు ఆధారంగా మానవ చరిత్రలో నూతనశకోదయ మౌతోంది. భూదేవికి వసంతోదయంలో నూతనచైతన్యం పుష్పిస్తోంది."

"మాదైన స్వాతంత్ర్యాన్ని పునరార్జించుకోవడం మా వంతు. జీవితం ప్రసాదించే సకల సుఖసౌందర్యాల్ని అనుభవించడం మా హక్కు. ప్రకృతిసిద్ధమైన జాతీయప్రాభవాన్ని పునఃప్రకాశింపచేయడం మా కర్తవ్యం."

"సత్యం ధర్మం మా పక్షాన ఉన్నాయి. స్త్రీలు, పురుషులు, పిన్నలు పెద్దలు అందరు నవచైతన్యం పొందుతున్నారు. తరతరాల మా పూర్వులు ఆశీర్వదిస్తున్నారు. యావత్ప్రపంచం ఆదరసౌజన్యాలతో మా జాతిని వీక్షిస్తోంది".

ఈ వాక్యాలతో భారతీయ దేశవాసులు 30 ఏళ్ల క్రిందట స్వాతంత్ర్యశంఖారావం పూరించారు. భరతభూమిలో ప్రజారాజ్య ప్రతిష్ఠాపన సమయంలో ఈ వాక్యాలు జ్ఞప్తికి వస్తున్నాయి.

కాని ఈ వసంతోదయకాలంలో మన ఆకాశం మేఘావృతమై ఉంది. అయినప్పటికీ భారతజాతికి సహజలక్షణాలైన క్షమ, సహనం, విచక్షణ కాలక్రమాన సుఖం చేకూర్చగలవనే ఆశ అందరిలోనూ దృఢంగా ఉంది. ఈ ఆశే భారతదేశానికి రక్ష.

భారతదేశంలో ప్రజాస్వామిక రాజ్యాంగవ్యవస్థాపన భారతదేశచరిత్రలోనే కాదు మానవపరిణామచరిత్రలో కూడా అపూర్వఘట్టం. సర్వమానవుల సమత్వసౌజన్యసిద్ధాంతాల ఆధారంతో భారతదేశం రాజ్యాంగవ్యవహారాలు నెరపగలదు. సర్వజాతుల స్వాతంత్ర్యానికి నైతికబల మివ్వగలదు.

భారతరాజ్యాంగపరిషత్తు మూడేళ్లు కృషిచేసి దీర్ఘ రాజ్యాంగపత్రాన్ని తయారు చేసింది. రాజ్యాంగరచన ప్రారంభమైనప్పుడు దేశం కల్లోలంలో మునిగిఉంది. బెంగాల్ మతకలహాలు ప్రపంచమంతనీ విభ్రాంతపరిచాయి. దేశవిభజనను ప్రజలు అగత్యమన్నట్లుగానే సమ్మతించారు. బ్రిటిష్ పాలకుల కుతంత్రాలవల్ల కులమతభేదాలు మితిమీరి రాజ్యాంగరచనాసమయానికి వికృతరూపం దాల్చాయి. మాతృభూమి విచ్ఛిన్నమై మతకలహాలు వ్యాపించిన కాల



**మనరాజ్యాంగ ఆశయనిర్దేష్ట — పండిట్ జవహర్లాల్ నెహ్రూ**

[illegible]ల్లో రాజ్యాంగరచన ప్రారంభమయింది.

దేశవిభజనఫలితంగా భారతరిపబ్లిక్‌కి రాజ్యాంగంలో మూడు ముఖ్య ఫలితాలు కలిగాయి: (1) బలీయమైన కేంద్ర ప్రభుత్వం (2) ప్రత్యేకనియోజకవర్గాల రద్దు (3) సంస్థానాల విలీనం.

క్రమక్రమంగా ప్రపంచంలో ప్రజలపై ప్రభుత్వాల అధికారికపరిపాలన అధిక



రాజ్యాంగరచనా సంఘాధ్యక్షుడు డాక్టర్ భీమారావు అంబేద్కర్

మాతున్న ఈకాలంలో, యుద్ధకాండకి సౌకర్యాలు విపరీతంగా పెరుగుతున్న ఈ క్లిష్ట సమయంలో, భారతరాజ్యాంగంపై కాల ప్రభావం బలీయం కాక తప్పలేదు. అకారణశత్రుత్వం సాధిస్తున్న పాకిస్తాన్ ప్రభావంవల్ల దేశంలో ఆధికారికపరిపాలన ఏర్పడక తప్పనిసరి వచ్చింది. దేశవిభజన జరిగిందేకాని, పాకిస్తాన్ కోరిక ప్రకారం హిందూముసల్మాన్ సమస్య పరిష్కారం కాలేదు. భారతదేశంలో ఇంకా రెండుకోట్లమంది మహమ్మదీయులున్నారు. అదీకాక దేశమంతటా ప్రజల్లో అనేక మతాలు, కులాలు, వర్ణాలవారున్నారు. ప్రతిప్రాంతంలోనూ అనేకవందల శాఖలుగా చీలిపోయి సమాజవ్యవస్థ శిథిలమైపోయిన ప్రస్తుతపరిస్థితిలో జాతీయైక్యతాభావాన్ని పెంపొందించడానికీ, దేశైక్యతను కాపాడ్డానికీ కేంద్ర ప్రభుత్వాన్ని బలపరిచి రాష్ట్రప్రభుత్వాలను బలహీనపరచడంలో ఆశ్చర్యం లేదు. ఈసందర్భంలో అల్పసంఖ్యాకవర్గాల ప్రతినిధులు దేశపరిస్థితినీ, దేశంపట్ల తమ కర్తవ్యాన్నీ గుర్తించి రాజ్యాంగనిర్మాణంలో జాతీయైక్యత సాధనకు ఎంతైనా తోడ్పడ్డారు. ప్రత్యేక నియోజకవర్గాల పద్ధతి రద్దు చెయ్యబడింది. ఏ మతానికి చెందినవారైనప్పటికీ అన్ని మతాల ప్రజల విశ్వాసాన్నీ ఆర్జించుకున్నవారయితే వారు శాసనసభలకు ఎన్నుకోబడగలరు. దీనివల్ల అన్నిమతాలవారూ పక్షపాతబుద్ధితో కాక దేశక్షేమదృష్ట్యా రాజకీయాలు నెరపుకోగలరు. కులమతాది వైషమ్యాలకు తావులేకుండా చెయ్యడానికి అవకాశం లభిస్తుంది. కులమతాది వివక్షతలతో నిమిత్తంలేని రాజ్యాంగవ్యవస్థాస్థాపనకు అవకాశం కలుగుతుంది.

కేంద్ర ప్రభుత్వానికి అపారమైన అధికారాలివ్వడంలో బ్రిటిష్ పాలకులు తయారుచేసిపెట్టిన 1935 భారతరాజ్యాంగ చట్టం చాలవరకు తోడ్పడిన మాట నిజమే. ఆ చట్టం అనేకరీతుల కెనడారాజ్యాంగ శాసనానికి అనుకరణ. భారతరాజ్యాంగ రచయితలు కెనేడియన్, అమెరికన్, బ్రిటిష్‌రాజ్యాంగాలలోని అనేకనిబంధనల్ని తీసి మన దేశానికనువైనరీతిని రిపబ్లిక్‌రాజ్యాంగంలో చేర్చారు. కేంద్రప్రభుత్వాధికారాల నిర్ణయంలోనూ, వివిధ రాష్ట్రాల అధికారాల నిర్ణయంలోనూ కెనేడియన్‌రాజ్యాంగం తోడ్పడింది. వ్యక్తిస్వాతంత్ర్యాల సందర్భంలో కొన్ని ముఖ్యమైన మార్పులతో అమెరికన్ నియమాలను సేకరించారు.

## వ్యక్తిస్వాతంత్ర్యాలు

వ్యక్తిగత ప్రాథమికస్వాతంత్ర్యాల నిర్వచన అమెరికన్ నియమాల పోలికనే ఉంది. సమాజవ్యవస్థలో ఆర్థిక రాజకీయ రంగాలలో అందరికీ సమానమైన న్యాయం చేకూర్పగల

(10-వ పేజీ చూడుడు)

**రిపబ్లిక్ అధ్యక్షులు**

రాజ్యాంగ పరిషదధ్యక్షులుగా ప్రజాప్రతినిధుల విశ్వాసాన్నిగడించి, రిపబ్లిక్ ప్రథమాధ్యక్షుడుగా ఏకగ్రీవంగాఎన్నుకోబడిన

**శ్రీ రాజేంద్రప్రసాద్.**



రాజ్యాంగంలో సమిష్టినియోజకవర్గవిధానాన్ని ప్రవేశపెట్టిన
## సర్దార్ వల్లభాయ్ పటేల్

రనీ, భావనలో, భావప్రకటనలో, మతంలో విశ్వాసంలో, మతానుష్ఠానంలో, ఆరాధనలో అందరికీ స్వేచ్ఛ నివ్వగలరనీ, సర్వవ్యవస్థల్లోనూ, సర్వఅవకాశాల ఏర్పాటులోనూ అందరికీ సమానహక్కులివ్వగలరనీ ప్రజల మధ్య స్నేహ సౌభ్రాతృత్వాలు పెంపొందించి వ్యక్తివికాసానికీ జాతీయైక్యతకీ అవకాశా లివ్వగలరనీ రాజ్యాంగప్రమాణం. ఇది ఒక విధంగా ఫ్రెంచి, అమెరికన్ వ్యక్తిస్వత్వసూత్రాల సమీకరణ అని చెప్పవచ్చు. కాని ఈ వ్యక్తిస్వత్వాలను అమలు జరపడంలో చాల వ్యత్యాసం ఉంది. అమెరికాలో హెబియస్‌కార్పస్ పిటిషన్ దాఖలు చేసే స్వాతంత్ర్యాన్నిమాత్రమే తాత్కాలికంగా రద్దుచేసేఅధికారం ప్రభుత్వాని కుంది. అతికూడా దేశంలో విప్లవం సంభవించినప్పుడుగాని, దాడి జరిగినప్పుడుగాని ఆ అధికారం ప్రభుత్వాని కివ్వబడుతుంది. ఇంతవరకూ అమెరికాలో అంతర్యుద్ధంకాలంలో ఒక్కసారి తప్ప ఈ హక్కు రద్దుపరచబడలేదు. మిగతావ్యక్తిస్వత్వాల్ని రద్దుచేసే హక్కు అమెరికన్ ప్రభుత్వానికే పరిస్థితిలోనూ లేదు. కాని భారతరాజ్యాంగంలో "అసాధారణపరిస్థితి" ఏర్పడినప్పుడెల్ల 359 నిబంధనప్రకారం వ్యక్తిస్వత్వాలకు సంబంధించిన నిబంధనల్ని అన్నిటినీ రద్దుపరచవచ్చును. ఈమాదిరి నియమం 1935 చట్టంలో ఉంది. ఈ నిబంధన ననుసరించే ఇంతవరకూ రాష్ట్రప్రభుత్వాలు శాంతిభద్రతాశాసనాలు విధించాయి. ఈ పరిస్థితి ద్వితీయప్రపంచయుద్ధానంతరం యథారీతిగా కొనసాగిపోతోంది. "అసాధారణపరిస్థితి" అంటే రాజ్యాంగంలో నిర్వచించబడినప్పటికీ, ఇప్పుడమలులో ఉన్న పద్ధతి నిబట్టి ఆ నిర్వచనాన్ని విస్తృతపరచడంలో పెద్ద కష్టమేమీ ఉండదని తెలుస్తుంది. ప్రభుత్వాలు ఈ అధికారాన్ని నిర్వహించడంలో ఆటంకాలంతగా లేవు. అందువల్ల నియంతృత్వాన్ని విశ్వసించే ఏ రాజకీయపక్షమైనా శాసనసభలో సభ్యత్వ సంఖ్యాధిక్యతను ఏదోరీతిని తెచ్చుకోగలిగే పక్షంలో, మిగతారాజకీయపక్షాల్ని అణగదొక్కడానికి ఈ నిబంధనల్ని ప్రయోగించగల ప్రమాదం ఉంది. "అసాధారణపరిస్థితి" నిర్వచనకు పరిమితులు విధించే అధికారం సుప్రీంకోర్టు కిచ్చినట్లయితే అంత ప్రమాదం ఉండేదికాదు. అమెరికాలో న్యాయస్థానానికీ అధికారం ఇవ్వబడింది. అందువల్లనే వ్యక్తిస్వత్వాల ఆదరణ బ్రిటన్‌లోకంటె అమెరికాలో సంతృప్తికరంగా ఉందని చెప్తారు. మనదేశంలో ఒకవైపున పాకీస్తాన్ మరొకవైపున కమ్యూనిస్టుల ముప్పు పెనకొంటున్న పరిస్థితిలో ఈ నిర్బంధాలు సమర్థనీయమైనవే కావచ్చును. కాని అధికార దుర్వినియోగాన్ని నిరోధించడానికి బలమైన

(15 వ పేజీ చూడుడు)

### చిత్రరూపంలో మన రాజ్యాంగం

కొత్తరాజ్యాంగంప్రకారం యూనియన్, స్టేట్ పరిపాలనా కార్యక్రమాల విధానం 11 వ పుటలో చిత్రాలు సూచిస్తాయి. 12 వ పుటలో శాసనసభల కేరీతిగా ఎన్నికలు జరుగుతాయో వివరించబడింది. 13వ పుటలో ఏయే విషయాలపై యూనియన్ పార్లమెంటు శాసిస్తుందో, వేనిపై స్టేట్ శాసనసభలు శాసిస్తాయో, వేనిపై ఉమ్మడి శాసనాధికారం ఉందో వివరించబడింది. 14 వ పుటలో న్యాయవిచారణ విధానం వివరించబడింది.

# పార్లమెంటరీ ప్రభుత్వం




పార్లమెంటు ఏడాదికి రెండుసార్లైనా సమావేశమవాలి. యూనియన్, సమిష్టిజాబితాల్లో వేనిపైనైనా శాసించవచ్చు. దేశావసరాలు లేక అసాధారణపరిస్థితుల్లో, లేదా స్టేట్ల అనుమతితో స్టేట్ జాబితాల్లో విషయాలపై కూడా శాసించవచ్చు.

## యూనియన్




స్టేట్, సమిష్టి జాబితాల్లో విషయాలపై స్టేట్ శాసనసభలు శాసించవచ్చు. ఏడాదికి రెండుసార్లైనా సమావేశమవాలి.

## స్టేట్

# ఎన్నికలు, శాసనసభలు




21 ఏళ్ళకి వోటువేసే హక్కు

సార్వజనీన, సమిష్టి నియోజకవర్గాలు. ప్రతి 5 ఏళ్ళకి ఎన్నికలు. వెనుక వర్గాలకి స్థానాల ప్రత్యేకింపు



ప్రజాప్రతినిధులు 500 మందికి మించకుండా
(5 నుంచి 7½ లక్షల కొకరు చొ॥)
స్టేట్స ప్రతినిధులు—250 మందికి మించకుండా
(స్టేట్స్‌నుంచి 238 మంది, 12 గురు నియమితులు)

అధ్యక్షుడు నియమించే ఎన్నికల కమీషనరు







ఐదేళ్ళ కెన్నిక, 500 కి మించక 60 కి తగ్గక సభ్యత్వం. 75 వేల ప్రజలకొకరు చొ॥

మద్రాసు, బొంబాయి, బెంగాల్, యు. పి., బిహారు, పంజాబు, మైసూరులలో మాత్రమే. ప్రతి మరుచటి ఏడూ మూడోవంతుకి ఎన్నిక. శాసనసభ్యులసంఖ్యలో నాలుగో వంతుకి మించకుండా, 40 మందికి తగ్గకుండా.

# శాసనాధికారాలు



యూనియన్
రైల్వే
నౌకలు
రేవులు
విమానాలు
రహదార్లు
యుద్ధం
శాంతి
విదేశవ్యవహారాలు
కరెన్సీ
నాణేలు
విదేశమారకం
రేడియో
తంతితపాలా
విదేశవర్తకం
రవాణా
స్టాక్ ఎక్స్ఛేంజి
బీమా
బాంకింగ్
సైనికదళాలు
పెట్రోల్
గనులు
ఉప్పు
ఆయుధాలు
సినిమా
తూకాలు
పురావస్తు
పేటెంట్లు
జనాభా
వాతావరణపరిశీలన




సమిష్టిజాబితా
పెళ్లి విడాకులు మొ॥
దత్తతవీలు మొ॥
న్యాయం
వైద్యం
మొ॥ వృత్తులు
పత్రికలు
పుస్తకాలు
అచ్చు
నేరవిచారణ
కార్మికవ్యవహారాలు
PRICE CONTROL
ధర్మసంస్థలు
గుళ్లు
సివిల్ కేసులు
ఆరోగ్యసూచీ
చిన్న రేవులు
ధరలకంట్రోల్
ఫ్యాక్టరీలు
విద్యుచ్ఛక్తి




స్టేట్ జాబితా
పోలీసు
జైళ్లు
కోర్టులు (హైకోర్టు సుప్రీం కోర్టు మినహా)
విద్య
ఆస్పత్రులు
ఆరోగ్యం
పశువులు
వ్యవసాయం
ఇరిగేషన్
చేపలు
రోడ్లు
అడవులు

# న్యాయవిచారణ




సుప్రీంకోర్టు, హైకోర్టుల్లో చీఫ్ జడ్జీలను, జడ్జీలను నియమిస్తారు.




**వినాగణాధికారం**

హైకోర్టులు, ట్రిబ్యునల్సు నుంచి వచ్చే సివిల్, క్రిమినల్ అప్పీళ్లు; యూనియన్ స్టేట్సు మధ్యనూ, స్టేట్సు మధ్యనూ తగాదాలు; రాజ్యాంగనియమనిరూపణ; ప్రధానపౌరస్వత్వాల అమలు; అన్యాయాలను కోరే పరిష్కారనిర్ణయాలు.



## సుప్రీంకోర్టు

## హైకోర్టులు









ప్రభుత్వోద్యోగాల్లో పరిపాలనశాఖ నుంచి న్యాయశాఖను విడగొట్టడానికి స్టేట్స్ ప్రయత్నించాలి —50 వ నియమం



రాజ్యాంగరచనకు మూలకర్త ప్రఖ్యాత న్యాయశాస్త్ర నిపుణులు శ్రీ అల్లాడి కృష్ణస్వామిగారు

(10-వ పేజీ తరువాయి)

నియమాలు లేవు. వ్యక్తిస్వాతంత్ర్యాలను రక్షించే అధికారం ప్రమాదపరిస్థితుల్లో న్యాయస్థానాలకివ్వబడలేదు.

## సమానావకాశాలు :

ఆర్థిక, రాజకీయ, సాంఘిక రంగాలలో ప్రజలందరికీ సమానమైన ప్రతిపత్తి, అవకాశాలు ఇవ్వడం భారతరాజ్యాంగప్రధానాశయం. ప్రభుత్వోద్యోగుల నియామకంలో జాతిమత వర్గ కులభేదాలు, వంశతారతమ్యాలు, స్త్రీపురుషభేదాలు పాటించరాదని 16 వ నిబంధన స్పష్టంగా విధిస్తోంది. బ్రిటిష్ పరిపాలకులు ఉద్యోగాలివ్వడంలో అన్ని [illegible] పాటించారు. ధనికులు, బ్రిటిష్‌రాజరికంపట్ల భక్తిగల వారివంశాలలో యువకులకే ఉద్యోగాలిచ్చేవారు. దేశంలో కులమతాదిభేదాలు సమాజజీవనాన్ని విచ్ఛిన్నపరచగలిగాయి. తరతమభేదాలు సృష్టించాయి. వీనిని రద్దుపరిచి అందరికీ సమానావకాశాలు కల్పించడానికి రాజ్యాంగంలో ఏర్పాటు కావడం వల్ల విమర్శలు నిర్మూలం కాగలవని ఆశించవచ్చును. వాస్తవంగా ఏర్పాటు సహాయం పొందదగినవారు నిమ్నజాతులవారు. జాతిసముద్ధరణవల్ల ఇంతవరకూ వారికి కలిగిన ప్రయోజనం దాదాపు శూన్యం. వారికి మాత్రమే పదేళ్ళవరకూ కొన్ని ఉద్యోగాల

# భారత రిపబ్లిక్ రాజ్యాంగం

సంఖ్యను ప్రత్యేకించే ఏర్పాటు చెయ్యబడింది. ఇది అవసరమని అందరూ అంగీకరించగలరు. కాని ఈనాడు చెన్నరాష్ట్రంలో కులనిష్పత్తి ఇంకా అమలులో ఉంది. దీన్ని నిర్మూలించనిదే ఇప్పటికే అక్కడక్కడ వ్యాపించి ఉన్నకులద్వేష మాత్సర్యాలు నిర్మూలం కావు. నూతన రాజ్యాంగంలో కులనిష్పత్తులకి తావు లేదు. 16 వ నిబంధనలోని 4 వ ఉపనిబంధన నిమ్నవర్గాలవారి ప్రయోజనానికి మాత్రమే ఉద్దేశించబడింది. కాంగ్రెస్ ఆశయాలకు కట్టుబడి ఉండికూడా ఇంకా ఈ పక్షపాతాలు పాటించడం జాతీయైక్యతకు ముప్పు.

ఇదివరకే ఈ కాంగ్రెస్ నాయకులు ఈ సత్యాన్ని గ్రహించకపోవడం శోచనీయం. సహాయం ఇవ్వవలసిఉంటే పేదలకు ఇవ్వాలి. మంత్రిపదవులు తెచ్చుకోడానికి కులరహిత నిరాజకవర్గ వ్యవస్థ ఆటంకం కాలేదు. కులరహితరాజకీయవ్యవస్థవల్ల కొన్నికులాలవారికి అవకాశాలు లభించవని చెప్పడం అసత్యం. అది కాంగ్రెస్ ఆశయాలకు విరుద్ధం. ఆ కులాల ఆత్మగౌరవానికే నీచం. ఆ కు-



భారతజాతీయ కాంగ్రెస్ అధ్యక్షులు డా. భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు.

లలో ప్రభవించిన రామలింగారెడ్డి, త్రిపురనేని, కూర్మా, అంబేద్కర్ వంటి మహామహులపట్ల అపచారం. వారి నే కులనిష్పత్తులూ ఉపసంహరించలేదు. ఏ ప్రాంత రాజకీయాల ప్రభావానికి లోనైన మన నాయకులు ఈ



రాజ్యాంగం ముసాయిదాను రచించిన పరిషత్తు సలహాదారు సర్. బి. నరసింగరావుగారు

మనస్తత్వాన్ని విడిచి, వాస్తవంగా సహాయానికి అర్హులు, అవసరమైనవారు అయిన హరిజనులకి నిష్పత్తిని విడిచిపెట్టి తమ కులాల పౌరుషగౌరవాల్ని నిలబెట్టుకోవాలి. నూతనరాజ్యాంగం ఇటువంటి అవకాశమిస్తోంది. సౌజన్యంతో సౌభ్రాతృత్వభావంతో ఈవిషయాన్ని పరిశీలించి జాతీయైక్యతకు సర్వావకాశాల్ని కల్పించవలసిన అవసరం ఉంది. గతినైచ్యాల్ని, జస్టిస్ పార్టీ రాజకీయాల్ని మరచి దేశంలో నూత్నచైతన్యం తెచ్చి సహకారసౌమ్యతలు చేవలసిన అవసరం ఉంది. అప్పుడే ప్రజాస్వామ్యసిద్ధాంతం సార్థకం కాగలదు.

## కేంద్రప్రభుత్వం:

పరిపాలనావిషయాల్ని కేంద్రప్రభుత్వం రాష్ట్రప్రభుత్వాల మధ్య విభజించినపద్ధతి కెనడా రాజ్యాంగాన్ని 1935 భారత రాజ్యాంగశాసనాన్ని అనుసరించి ఉంది. అమెరికాలో రాష్ట్రపాలనాధికారం ప్రధానం. కేంద్రపాలనాధికారం ద్వితీయం. కేంద్రప్రభుత్వం ఆజ్ఞల్ని రాష్ట్రాలు పాలించితీరాలనే నిర్బంధం అమెరికాలో లేదు. భారతరాజ్యాంగంలో అటువంటి నిర్బంధం విధించబడింది. అంతే కాదు.



రిపబ్లిక్ కాకముందు గవర్నర్ జనరల్ సి. రాజగోపాలాచారిగారు

రాష్ట్రగవర్నర్లను రిపబ్లిక్ అధ్యక్షుడు నియమిస్తాడు. కొన్ని రాష్ట్రశాసనాలకు అధ్యక్షుని సమ్మతి అవసరం. రాష్ట్రశాసనాలు కేంద్రశాసనాలకు అనుకూలంగా లేక, ఏకొంచెమైనా వైరుధ్యం సంభవిస్తే కేంద్రశాసనమే అమలుజరగాలి. రాష్ట్రశాసనంలోని విరుద్ధ నియమాలు రద్దయిపోతాయి. రాష్ట్రపరిపాలన రాజ్యాంగనియమాలు సవ్యంగా పాటించబడటంలేదని అనుమానం తోచినప్పుడు రిపబ్లిక్ అధ్యక్షుడు, కేంద్రపార్లమెంటు రాష్ట్రాల్ని శాసించగల అధికారాలివ్వబడినాయి. అవసరమైనప్పుడు రాష్ట్రపరిపాలనాభారాన్ని కూడా పార్లమెంటు, అధ్యక్షుడు హస్తగతంచేసుకునే అధికారం ఇవ్వబడింది.

అనేక రాష్ట్రాలకు అవసరమనిగాని దేశానికవసరమనిగాని అధ్యక్షుడు భావించే విషయాల్లో, అవి రాష్ట్రశాసనాధికారాల జాబితాలో చేరినవైనప్పటికీ, స్టేట్సుకౌన్సిల్ తీర్మానంపైన పార్లమెంటు శాసనాలు చెయ్యవచ్చును. న్యాయవిషయనిర్వహణలో రాష్ట్రప్రభుత్వాలకు కేంద్రప్రభుత్వం ఆజ్ఞలివ్వగల అధికారమివ్వబడింది. యూనియన్ శాసనాలన్నిటినీ సక్రమంగా నిర్వహించే బాధ్యత రాష్ట్రప్రభుత్వాలపై మోపబడింది.

అసాధారణపరిస్థితుల్లో రాష్ట్రశాసనసభల్ని రద్దుపరిచి రాష్ట్రశాసన, పరిపాలనాదివ్యవహారాల్ని కూడా హస్తగతం చేసుకునే

(41 వ పేజీ చూడుడు)




# మకరసంక్రాంతి

శ్రీమతి లలితకుమారి

సంక్రాంతిపండుగ జరుపుకొన్నాం! మరి ఆ పండగేమిటో కొంత తెలుసుకొందామా!

మన పండగలూ పబ్బాలూ సాధారణంగా ఏదోఒక పవిత్రమయిన ఉద్దేశంతో చేసుకునేవైవుంటవి. సూర్యుడు ఉత్తరదిక్కుకు అభిముఖంగా పయనించడానికి ప్రారంభించే సందర్భంలో మనం ఈ పండగ జరుపుకొంటాం. సూర్యుడు అలా ఉత్తరదిగభిముఖుడు కావటం అతడు మకరరాశిలో ప్రవేశించినతరువాతనే. ఇలా సూర్యగతిలో యేర్పడే మార్పును గుర్తించి ఆ పవిత్రమయిన సందర్భాన్ని పురస్కరించుకొని మనం ఈ పండగ జరుపుకొంటాం. సూర్యుడు మకరరాశిలోకి ప్రవేశిస్తాడుకనుకనే దీనికి 'మకరసంక్రాంతి' అని పేరు. ఆనాటినుంచే ఉత్తరాయణపుణ్యకాలం ఆరంభం అవుతుంది.

ఈవిధంగా సూర్యుడు ఉత్తరదిగభిముఖుడయ్యే పవిత్రఘడియలు మనకు పర్వకాలం. ఒకవిధంగా, ఖగోళకంగా చూస్తే, నేటితోనే నూతనసంవత్సరం ఆరంభిస్తుంది. నూతనసంవత్సర ప్రారంభంతో అందరూ సంబరపడేలాగే మనమూ సంబరపడతాం. ఆనాడు పితృదేవతలను స్మరించి తిలతర్పణాలు విడిచి పండగచేసుకుంటాం. ఈ పుణ్యకాలంలో పుణ్యనదీస్నానం, కూష్మాండాదిదానం ప్రశస్తంగా మన పురాణాలు పేర్కొంటున్నవి.

భోగి, సంక్రాంతి, కనుము- ఈ మూడురోజులూ అతివైభవంగా జరుపుకునే యీ పండగలనిగురించి మనవాళ్లు ఒక కథ చెపుతారు. ప్రహ్లాదుడికి మనుమడైన బలిచక్రవర్తి దేవతలను ఓడించి లోకాన్ని నిత్యకల్యాణం పచ్చతోరణంగా యేలుతూవుంటే పదభ్రష్టుడైన దేవేంద్రుడు విష్ణుదేవునితో మొరపెట్టుకున్నాడట. అప్పుడు విష్ణుదేవుడు వామనావతారంఎత్తి బలిచక్రవర్తిని నిగ్రహించేందుకై వటువువేషంతో బలిదగ్గరికి పోయి మూడడుగుల భూమి యాచించి రెండడుగులచే భూమ్యాకాశములను ఆక్రమించుకొని మూడోఅడుగుతో బలిచక్రవర్తిని పాతాళలోకానికి త్రొక్కివేసినాడట! అప్పుడు బలిచక్రవర్తి దీనంగా ప్రార్థించేసరికి కరుణించి సంవత్సరానికి మూడురోజులు నీపరిపాలన లోకంలో కొనసాగుతుందని వరమిచ్చాడట, ఆ రోజులే భోగి, సంక్రాంతి, కనుము. అందుకే ఆ మూడురోజులూ ఎంతపేదవాడి యిల్లైనా 'నిత్యకల్యాణంపచ్చతోరణం'గా కలకల్లాడుతూవుంటుంది.

దక్షిణాయనం అంత ప్రశస్తమయినకాలం కాకపోవటంచేత, దక్షిణాయనం పోయి ఉత్తరాయణం ఆరంభించడానికి ముందురోజు అంటే భోగినాడు దక్షిణాయనపీడాపరిహారానికి భోగిమంట వేసి యిండ్లలో వుండే పాతవస్తువులన్నీ అందులో పడేసి ఉత్తరాయణం ఆరంభం కావటంతో - పాతవస్తువుల్ని పరిహరించి కొత్తవస్తువులతోటి వ్యవహారం జరుపుకుంటాం. దక్షిణాయనపీడాపరిహారానికై వేసుకునేదే భోగిమంట.

గోదాదేవి శ్రీరంగనాయకులను గోరి అతని అనుగ్రహము పడసి ఆ దినమున ఆయనతో దివ్యభోగముల ననుభవించుటచేత ఆ దినమునకు 'భోగి' అని పేరని వైష్ణవులు చెపుతారు.

సంక్రాంతికి దక్షిణదేశంలో 'పొంగల్' అని పేరు. ఈ పేరు ఆనాడు మనం మన యిండ్లలో చేసుకునే భోజనపదార్థంపేరిట

అమలులోకి వచ్చింది. కొత్తగా పండివచ్చిన ధాన్యంతో కొత్తకుండల్లో 'పొంగలి' చేసికొని ఆనాడు భుజించటం రివాజు. అందుకే ఆపండగకి 'పొంగల్' అని పేరు. సంయుక్తరాష్ట్రాల్లో ఈ పండుగనే 'కిచిడి' అని పేర్కొంటారు. ఇది కూడా ఆ పండగసందర్భంలో ఆదేశంలో వాళ్లు చేసుకునే భోజనపదార్థాన్ని బట్టి ఏర్పడిన పేరు. 'కిచిడి' అనేది మన పొంగలివంటి ఒక భోజ్యపదార్థము. బియ్యముతో కొన్ని పప్పుదినుసులను చేర్చి దీనిని తయారుచేస్తారు. ఇది మన పులగం వలె ఉంటుంది. ఆరోజు చేసుకునే పదార్థాల్లో యిది చాల ప్రధానమయినది. ఈ 'కిచిడి' లోకూడా అనేక రకాలు ఉన్నాయి. పేదవాడు మొదలుకొని పెట్టుబడిదారుడివరకూ వాడి వాడి అంతస్తుకు తగినట్టు చేసుకోదగినట్టుగా ఈ 'కిచిడి' తయారుచేస్తారు. ఔరంగజేబుకు 'బిరియానీ కిచిడి' అనే ఒకరకం భోజ్యపదార్థంపై చాలా ప్రీతిఅట! ఆనాడు బీదలకి పప్పుదినుసులు కలిపిన ఈ బియ్యాన్నే బిచ్చం పెడతారు. కొత్తగా ఇంటికి పంటలు వచ్చిన రోజుగనుక బీదా బిక్కీ అంతా సంతోషంగా వుండాలని, తమ సంతోషంలో వాళ్లుకూడా పాలు పంచుకోవాలని వాళ్ల అభిప్రాయం. సంసారులు ఆనాడు ఈఆశయంతోనే నేటికీ బిచ్చం పెడతారు.

సంక్రాంతినాడు ప్రయాగలో స్నానం మహాప్రశస్తంగా మన పురాణాలు చెబుతాయి. గ్రహణంనాడు కాశిలోను, సంక్రాంతినాడు త్రివేణీసంగమంలోనూ శ్రీరామనవమినాడు అయోధ్యలోనూ స్నానం చేస్తే పుణ్యలోకాలు కలుగుతాయని మనవారి నమ్మకం. సంక్రాంతినాటినుండే అలహాబాదులో 'మాఘమేళ' ప్రారంభం అవుతుంది.

తమ వ్యవసాయానికి, పాడిపంటలకు ముఖ్యసాధనాలయిన పశువులను సంక్రాంతినాడు చక్కగా అలంకరించి మువ్వలు కట్టి వినోదిస్తారు. గ్రామాల్లో ఈ 'పశువులపండగ'ను రైతుజనం అత్యుత్సాహంతో జరుపుకొంటుంది. బాగా బలిసిన కోడెదూడల్ని పందెములకు విడిచి వినోదిస్తారు. దక్షిణదేశంలో దీన్ని 'మాట్టుపొంగల్' అంటారు. ఆ తరువాతిదినాన్ని దక్షిణదేశంలో 'కాణుంపొంగల్' అంటారు. ఆదినం ఇంటిల్లపాదీ కొత్తబట్టలు కట్టుకొని పెద్దలను దర్శనం చేసుకొని వాళ్లకి నమస్కారాలు చేసి వాళ్ల ఆశీర్వాదాలు పొందుతారు. 'కాణుంపొంగల్' అంటే (పెద్దలను) చూచుపండగ అని అర్థం. ఈ అర్థంతో ఏర్పడిన యీ 'కాణుంపొంగల్' అనే పండగే మనకు 'కనుము' అయింది. మన నిఘంటువుల్లో 'కనుము' అనే పదానికి ఒక పర్వదినానికి తరువాతి దినం అని అర్థం వ్రాసివుంది. 'కనుము' అనే పేరు దానికి ఎలా వచ్చిందో చెప్పలేదు. ఒక పర్వదినం జరుపుకున్నాక శుభంగా కొత్త బట్టలు కట్టుకొని పెద్దల్ని దర్శించి వారికి నమస్కారం చేసి వారి ఆశీర్వాదాలు పొందేదినంగనకనే దానికి 'కనుము' అని పేరు కలిగింది. భోగి, సంక్రాంతి, కనుము ఈ మూడురోజులూ కన్నెపిల్లలు గొబ్బి పెట్టి పూజిస్తారు. కనుమురోజున గొబ్బిని ఏ చెరువులోనో నదీప్రవాహంలోనో వాలాడిస్తారు.

అల్లుళ్ళ ఆదరింపులతో, ఆడపడుచుల హంగామాలతో, కన్నెపిల్లల గొబ్బిపాటలతో, పశువుల పాకల్లో వీధుల్లో గల్లుగల్లుమనే



తిరుపతిక్షేత్రము ప్రధానగోపురం—నౌబత్ ఖానా

# సూక్ష్మంలో మోక్షం

శ్రీ దిట్టకవి లక్ష్మీనరసింహాచార్యులు

ఒకవూరిలో ఒక బీదబ్రాహ్మణుడు ఉండేవాడు. ఆయన గొప్ప పండితుడు. ఐతే, ఆ బ్రాహ్మణుని పాండిత్యాన్నీ, విద్యనూ చవిచూచినవాళ్లెవరూ లేకపోయారు. ఆదరణ లేకపోవడంచేత ఆయన గర్భదరిద్రంలో మగ్గిపోతున్నాడు. పేదరికానికితోడు, కుచేలుడికి మోస్తరుగా, మన బ్రాహ్మణుడికి గంపెడుమంది పిల్లలు కూడాను.

ఆ పెద్దకుటుంబాన్ని పోషించే దారి కానక, ఆయనకు సంసారాన్ని వదలాలని విరక్తి పుట్టింది. అందుకని ఒకరోజున ఇంట్లో ఎవరికీ చెప్పకుండా కాశీకి వెళ్లుదామని బయలుదేరాడు.

పోయిపోయి బ్రాహ్మణుడు కొన్నాళ్లకు ప్రయాగ చేరుకున్నాడు. ప్రయాగ పేరుపొందిన పుణ్యక్షేత్రం. అందులోనూ యిక్కడ గంగా, యమునా, సరస్వతీ అనే మూడు నదులు కలుస్తున్నాయి. మూడు నదులూ కలిసే స్థలాన్ని 'త్రివేణీసంగమం' అంటారు.

అసలీమూడునదులూ, దేనికదే మహిమ గొప్పగా గలవి. అటువంటప్పుడు మూడూ ఒకచోటనే కలుస్తున్నవంటే ఆమహిమ ఎంతటిదో? ఎవరు చెప్పగలరు? ఎవరైనా మనస్సులో ఒక కోరిక కోరుకొని, పడి చచ్చిపోయినట్లయితే—మళ్లీ జన్మలో ఆ కోరిక తప్పక నెరవేరుతుందని ఒక వాడుక కూడా ఉన్నది.

ఈ నమ్మిక అలా ఉంచి పుణ్యం ఆర్జించాలనే వుద్దేశంతో దేశదేశాల నుండి వేనవేలుజనం వచ్చి, ప్రతిరోజునా త్రివేణిలో స్నానంచేస్తూ ఉంటారు.

ఈ జనాన్ని చూచేసరికి మన పేదబ్రాహ్మణుడికి పుణ్యం ఆర్జించాలని బుద్ధిపుట్టింది. ఈ జన్మానికి ధనం ఎలానూ లేదు. పుణ్యమన్నా ఆర్జిద్దామని అతని ఆశ.

నదికి వెళ్లాడు. నదిఒడ్డున నలుగురుసువాసినులు కనుపించారు. వాళ్లు కేవలమూ, దేవలోకంనుంచి దిగివచ్చిన గంధర్వకన్యలా అన్నంత అపరూపమయిన అందముతో వెలిగిపోతున్నారు.

వాళ్లు మెల్లిగా నదిలోకి దిగి అలా నీటిలోపలకు పోతూనే ఉన్నారు. కొత్తవాళ్లు కావడంచేత



నీటిలోతు తెలియదేమో ననుకొని, బ్రాహ్మణుడు వాళ్లతో! "ఇంక లోతుకు పోబోకండి! మునిగిపోతారు" అని హెచ్చరించాడు. "ఎంత లోతుంటేమటుకు మాకేం భయం? మళ్లీజన్మలో నెరవేరవలసిన కోరికలు కోరుకొని మునిగిపోవటానికే వచ్చాం" అని ఆ అమ్మాయిలు నవ్వుతూ, త్రివేణీమహిమను చెప్పారు. పేదబ్రాహ్మణుడు ఆశ్చర్యంతో వాళ్లవైపు చూస్తూ, నిలబడిపోయాడు.

(22 వ పేజీ చూడుడు)

---

మువ్వలతోటి త్రుళ్లిపడే దూడలతో గ్రామాలు కలకలలాడుతూంటవి. పంటనిండుకొన్న పట్లు పసుపు రాచుకున్న పండుముత్తైదువలాగ ఇంటికి నిండుగా ఉంటుంది. ముగ్గులు తీర్చిన ముంగిళ్లు ముచ్చటగా ఉంటవి. ఎక్కడ చూచినా నిత్యకల్యాణం పచ్చతోరణం.




నూటయేబదియేండ్ల క్రింద ఒక దేశంలో ఒకవిప్లవం జరిగింది. అంతకు పూర్వం ఇటువంటి విప్లవాలు—ఆదేశంలో మాత్ర మేమి, యెన్ని దేశాలలో నైనా సరే జరుగ లేదని, లేదు. తరువాత జరుగలేదని చెప్ప టానికీ వీలులేదు. ఇకముందు జరుగవని చెప్పటానికీ వీలులేదు. అసలు మానవుని చరిత్ర అంతే! విప్లవములయొక్క సమా హారమే! ఒకప్పుడు ఒక దేశంలోజరిగినవిప్లవం ఒకమాదిరిగా ఉంటుంది. ఇంకొక దేశంలో జరిగిన విప్లవం మరొకమాదిరిగా ఉంటుంది. అట్లాగే కాలాన్ని బట్టి కూడా విప్లవాల స్వరూపాలు మారుతూఉంటవి. ఇంత, కాల భేదం ఉన్నా, దేశభేదం ఉన్నా, విప్లవ స్వరూపభేదం ఉన్నా, జరిగేది ఒక్కటే, విప్లవం ఎప్పుడు తరంగాలు తరంగాలుగా వస్తుంది. మూడునాలుగు తరంగాలు కలిసి ఒక విప్లవం అవుతుంది.

ఒక దేశంలో ఒక కాలంలో పరిస్థితులు బాగుగాఉండవు. ఈబాగాలేకపోవటానికి హేతువులుగా కొందరధికారులు కన్పిస్తారు.

ఒక విప్లవతరంగం లేస్తుంది. ఆ అధి కారులను నాశనంచేస్తుంది. విప్లవతరంగం అంటే వాళ్లూ కొందరు మనుష్యులే. వెంటనే మరియొకవిప్లవతరంగం లేచి మొదటితరంగాన్ని హతమారుస్తుంది. ఇట్లా రెండు మూడు ఆవృత్తులు జరుగుతేనే కాని యేవిప్లవమూ పూర్తిగా సద్దుమణగదు. మొదటి విప్లవతరంగం, నాటి దుర్మార్గాన్ని సంహ రించటంకోసమేకదా అవతరించింది! ఆ తరంగాన్ని మరియొక తరంగం ఎందుకు సంహరించింది? అని ప్రశ్న. తరంగంలేని స్థితి మొదటి తరంగానికి దుర్మార్గంగా ఉన్న దని యెలా అనిపించిందో, రెండవతరంగానికి మొదటి తరంగం అట్లా అనిపించింది ఇల్లాగే అనిపిస్తూఉంటుంది. సముద్రంలో తరం గాలు వస్తూఉంటవి. ప్రతీదీ ఒడ్డుకు వస్తుంది. విరుగుతుంది. ఆతరవాతవచ్చేతరంగం తాను విరుగనిదానికిమల్లే పెద్ద యెత్తుగడ యెత్తు తుంది. సముద్రపుటొడ్డున మనము నిలుచుం టామా? దాని యెత్తుగడ చూస్తే, ఇంకేముంది, మనమీదికివచ్చి పడ్డదనుకొంటాం. అది అంత ఉద్ధృతంగా వచ్చి మొదటితరంగం విరిగిన చోటే తానూ విరిగి ఊరుకొంటుంది.

ఇది రెండు తరంగాల నడుమ జరిగిన కథ. మొదటి తరంగం లేచి ఆ పూర్వులలో కొందరు దేశద్రోహులని వారిని సంహ రించింది. ఈ తరంగమునకు నాయకు లున్నారుగా కొందరు? తరువాత తరంగం లేచి యీ నాయకు లందర్నీ పట్టుకొన్నది. తత్పూర్వ నాయకులు మహానుభావులని వాళ్లను సంహరించినందుకు ఈ ప్రథమ తరంగనాయకులను రెండవ తరంగపు నాయ కులు బందీచేసి వాళ్లను ఉరితీసిన కథ. ఈ కథలో ఇది ఒక ఉపాఖ్యానం.

ఆ దేశాన్ని బట్టి మనుష్యుల పేర్లు మారు తవి. అంతే భేదం. సంహరింపబడిన దేశ నాయకుడు గొప్పవాడు. అతని పేరు 'డామటన్' అనుకొందాము. ఈ డామటన్ యొక్క సంహారానికి హేతువుగా ప్రథమ విప్లవతరంగంలోని యేడుగురు నాయకులను పట్టుకొన్నారు. అందరికీ ఉ.గి.శిక్షలు వేశారు. అందరినీ ఉరి తీశారు. కాని అంద రినీ ఒక్కసారి ఉరితీయలేదు. ఒకని తరు వాత ఒకనినిగా విచారించటం శిక్షించటం జరిగింది.

ఈ విచారణ ఆషాఢమాసంలో మొదలు పెట్టింది. ప్రతివానియొక్క విచారణఅయిన తర్వాత. అతడు, దేశద్రోహి అని నిర్ణయం జరిగినతర్వాత వానికి ఉరిశిక్ష విధించక పూర్వం పైదీని, 'నీవేమి చెప్పకొంటావు?' అని అడగటం విచారణయొక్క పరిపాటి. ఆ యేడుగురు ఒకళ్లతర్వాత ఒకళ్లు ఏమేమి చెప్పారో వ్రాయటమే ఈ కథయొక్క ముఖ్యోద్దేశం.

ఆ మనుష్యుల పేర్లు చాలా అనవసరం. అందుచేత మా సాలవారీగానే వ్రాస్తే మంచిది.

ఆషాఢం—

నేను దేశముయొక్క అభ్యుదయాన్ని మనస్సులో పెట్టుకొనే యీ పని చేశాను. నాకు డామటునందు ఏవిధమైన వ్యక్తిగత ద్వేషమూ లేదు. ఆయన మహానుభావుడని నాకు తెలుసు. కాని ఆయన బ్రతికిఉంటే దేశానికి యింకా అనర్థం వాటిల్లుతుంది. అనర్థపరంపర వాటిల్లుతుంది. దానిని తొలగ బెట్టటంకోసమే నేనతని వధవిషయంలో తోడ్పాటు కలిగించుకొన్నాను. అధికారులై నన్ను విచారణచేయుటానికి కూర్చున్న

మీరందరు ఎంత దేశభక్తులో నేనూ అంతే దేశభక్తుణ్ణి. మన దేశంలో న్యాయము, ధర్మము, శాంతి ఉండాలని మీ రెంత వాంఛిస్తున్నారో నేనూ అంతే వాంఛిస్తున్నాను. నేను చనిపోయినాసరే నేను చేసినపని దోషమని నేననుకోను. త్రికరణశుద్ధిగా నేను దేశముయొక్క అభ్యుదయాన్ని వాంఛించే యీ పని చేశాను. ఈ మనదేశం జయించుగాక. నేను మరణించిన తరువాతగూడ నా యాత్మ సర్వథా ఈ దేశాభ్యుదయాన్నే పరిశీలిస్తూ ఉంటుంది. నేను నాయాత్మతో ఈదేశముయొక్క సౌభాగ్యాన్ని పరిశీలిస్తూ ఉంటాను.

శ్రావణం——

మీరు నన్ను శిక్షిస్తారని నాకు తెలుసు. శిక్షించటం మీస్వభావంలో ఉంది. మీకు క్రొత్తగా అధికారంవచ్చింది. ఆ అధికారాన్ని దుర్వినియోగం చేస్తున్నారు. మేమందరము నిజముగా దేశాభ్యుదయాన్ని మనస్సులలో పెట్టికొని ప్రవర్తించినవారము. డామట్ ను నేను చంపానంటే ప్రజాభిప్రాయాన్ని అనుసరించే చంపాను. ఇప్పుడు నన్ను విచారించేవాళ్లుకూడ ఆరోజుల్లో డామట్ చస్తేనేగాని ఈదేశం బాగుపడదని అనుకొన్నవాళ్లే. నే నేమీ అన్యాయం చేయలేదు. అధర్మం చేయలేదు. అతనిని వధ చేయుట పాపమని నే ననుకోటంలేదు. ఎన్నడూ అనుకోను. అతనిని వధించాను కనుక నే మీరు నన్నీనాడు విచారించి నాకు శిక్ష వేయటానికి తగిన శాంతపరిస్థితు లేర్పడినవని నేను నమ్ముతున్నాను. అధికారము మీచేతిలో ఉందికనుక ఇట్లా చేస్తున్నారు. నేను దేశద్రోహిని వధించాను. మీరు దేశభక్తుని వధిస్తున్నారు. నా ఆత్మ ఎప్పుడూ ఈదేశాన్ని వదలిపోదు. ఈదేశమునకు జయమగుగాక.

భాద్రపదం——

నేను డామట్ ను వధించానని విచారించటమే లేదు. నాకు సాధ్యమైతే వీలుంటే అటువంటి డామట్లను వందమందినైనా సంహరిస్తాను. ఆ డామట్ ను వందసార్లైనా సంహారిస్తాను. ఏఒక్కడిమూలంగా ఈ దేశం పరాధీనస్థితిలో ఉందో, ఈ దేశంయొక్క మానమర్యాద లన్నీ నాశనం కాబోయే స్థితిలో ఉన్నవో, అతనిని సంహరించటంలో నా కేమీ తప్పు కనిపించటంలేదు. నా స్థితిలో మీరుంటే మీరుకూడా తప్పకుండా ఆ పని చేసేవాళ్లు. నేను అతనిని వధించకపోతే నేను దేశద్రోహినని అని పించుకొనేవాడను. మీరే నన్ను దేశద్రోహి యనెడివారు. నేను మీకు చేసిన యుపకారము మీ కిప్పుడు తెలియదు. మీకు చేస్తూఉన్న యీ పనిలో ఉన్న దోషం మీ కిప్పుడు తెలియదు. నేను చేసిన మహా ఘనకార్యంయొక్క సత్ఫలము మీ రప్పు డనుభవిస్తున్నారు. భవిష్యత్ప్రజ లింకా అనుభవిస్తారు. నాకు శిలావిగ్రహములు వేసి భవిష్యత్తులో ఇంటింటా నన్ను పూజిస్తారు. భవిష్యచ్చరిత్ర మిమ్మల్ని నిందిస్తుంది. దుర్మార్గులైన మీరు మహాదేశభక్తుడైన నన్ను హత్యచేసిన దుర్మార్గులుగా చరిత్రలో నిలచిపోతారు. నేను తిరిగి మళ్లీ యీ దేశంలో నే పుట్టాను.

నా ఆత్మ ఈ మంటిలో కలిసిపోయి ఉంది. ఈమంటికి జయమగుగాక. ఈదేశానికి అభ్యుదయమగుగాక.

ఆశ్వయుజం——

(ఇతడు ఏడుస్తూచెప్పాడు.) నాకు భార్యాబిడ్డలూ ఉన్నారు. నేను డామట్ ను చంపలేదు. డామట్ చాల గొప్పవాడని నాకు తెలుసు. నా కేమీ తెలియదు. తక్కినవాళ్లు నన్ను మాయలోపెట్టారు. నేను డామట్ కు చాలా భక్తుణ్ణి. ఆయన నన్ను చాలాప్రేమగా చూసేవాడు. అనేకసార్లు నన్నాయన ఆశీర్వదించాడు. ఒకసారి అన్నాడుకదా! నీవు నన్ను చంపినా నేను నిన్నేమిచేయనన్నాడు. నామీద ఆయనకంత ప్రేమ. అట్లాంటివాణ్ణి నేనేదైనా చేశాననటం అసంభవం. ఈసాక్ష్యాలన్నీ బనాయించారు. ఇందులో ఒక్కటీ నిజం లేదు. మీ రాజకీయపు న్యాయవాది నాతరఫున చక్కగా వాదించలేదు. నేను సొంతంగా న్యాయవాదిని పెట్టుకొనేందుకు నాకు డబ్బులేకపోయింది. నేనుపేదవాణ్ణి, నేను చచ్చిపోతే నాపెళ్లాం బిడ్డలు ఎట్లాబ్రతుకుతారు ? మీరు చేస్తున్నదిది అన్యాయం.

(అని యేడుస్తుంటే న్యాయాధికారి బలవంతంగా రక్షకభటులచేత అతనిని క్రిందకు లాగించాడు.)

కార్తీకం——

నేను చెప్పవలసింది ఏమీ లేదు. నే నొక్కటే చెపుతున్నాను. నేను దోషినిగా అంగీకరిస్తున్నాను. అప్పుడు డామట్ ను వధిస్తేనేగాని దేశానికి అభ్యుదయం జరుగదని నే ననుకొన్నాను. అంతదాకా ఎందుకు! ఇప్పుడు మమ్మందరినీ ఉరి తీస్తేనేకాని న్యాయం జరుగదు అని మీ రనుకోటం లేదా ? అప్పుడల్లాగే మే మనుకొన్నాం. రేపుప్రొద్దున మమ్మల్ని ఇలా మీరు శిక్షించినందుకు ఇంకొకళ్లు వచ్చి మిమ్మల్ని శిక్షించకూడదా ? శిక్షించటం శిక్షించకపోవటం అధికారం చేతిలోకి రావటంలోనేగదా ఉంది. అప్పుడు మా కధికారం ఉంది. మేము చేశాము. మీ కిప్పు డధికారం ఉంది. మీరు చేస్తున్నారు. రేపీ యధికారం ఇంకొకరికి వస్తుంది. వాళ్లు చేస్తారు. అప్పుడు డామట్ ను చంపటం దేశానికి అభ్యుదయం. అతనిని సంహరించిన వాళ్లని శిక్షించటం నేడు దేశానికి అభ్యుదయమనుకొంటే మీరు చేయండి. ఎప్పు డేది యభ్యుదయమో ? ఎవరు చెప్తారు? ఎవరికి తెలుస్తుంది! అధికారంలో ఉన్నవాళ్లు అది అభ్యుదయమనుకొంటే అది అభ్యుదయమవుతుంది. నేను చచ్చిపోతున్నానని నాకు దిగులు లేదు. లేదని కాదు. ఉంది. బ్రతికిఉంటే అనుభవించే భోగాలుఅనంతంగా ఉన్నవని నాకు తెలుసు. నేను చచ్చిపోవటంవలన ఈదేశానికి అభ్యుదయం జరుగుతుందని మీ రనుకొంటే తప్పకుండా చేయండి ఇప్పు డనుకొనేవాళ్లు మీరుగనుక. దేశమాతా ! జయ ! జయ !

మార్గశిరము——

మీరు నన్ను నేను "ద్రోహినా? కానా?" అని అడుగుతున్నారు. నేను కానంటే మీరు వదలిపెట్టరు." అవునంటే మీరు సంతోషించరు. నన్నడగటం ఇదొక—లాంఛనం. మీ లాంఛనం నే నెందుకు జరపాలి ?అని ఊరుకోను. మీ కిది లాంఛనమే కాని ఇందులో నా కొక తృప్తి ఉంది. నా దేశప్రజలకు నా ఆత్మ యిటువంటిదని చూపవలసినదే అవసరం నాకు ఉంది. డామట్ ను హత్యచేసినవారిలో నా సోదరులు ఇద్దరు ముగ్గరు డామట్ ను ప్రశంసించారు. కొందరు ద్రోహులమని ఒప్పుకొన్నారు. కొందరు ఒప్పుకోలేదు. నే నటు చెప్పినా యిటు చెప్పినా వారిలోనో వీరిలోనో చేరుతాను. నా దేశప్రజలకు నే నిక్కడనుండి అభ్యర్థన చేస్తున్నాను. మీరు నన్నిలా శిక్షిస్తే పనికిరాదు. నేను చేసినది హత్య కాదు. చోరుని, జారుని హత్యకారుని విచారించినట్లు నన్ను విచారించటానికి మీకు హక్కులేదు. యుద్ధములో ఓడిపోయిన రాజును విచారించి శిక్షించట మెట్లా తప్పో, మీరు నన్ను విచా

రించటం అంతే తప్పు. ఓడిపోయిన రాజే గెలుస్తే, గెలిచినరాజు ఓడితే, మళ్లీ అల్లా జరుగవలసిందేనా? వాడికి సైన్యం తక్కువ, యుద్ధనీతి తక్కువ, అందుచేత ఓడాడు. యుద్ధంగెలిచేందుకు ఒకరాజు అనేకయెత్తులు ఎత్తుతాడు. అది తప్పనటం దుర్మార్గం. మే మధికారంలో ఉన్నప్పుడు మాకు న్యాయమని తోచింది చేశాం. మీ రిప్పుడు చేస్తున్నట్లే అప్పుడు చేశాం. మీరు మమ్మల్ని శిక్షించటం మానవధర్మానికి, రాజకీయధర్మానికి వ్యతిరేకమైనపని. మేము ఈ దేశాన్ని బాగుచేయవలెనని ప్రయత్నిస్తే ఈ దేశ మింత అథమస్థితిలోకి వచ్చిందని నేను విచారిస్తూన్నాను. మీవంటి అవివేకులయొక్క చేతులలోనుండి దేశమాత, సంరక్షింపబడుగాక.

పుష్యం—

(సూర్యునిసప్తాశ్వములు మణికింకిణీనినాదమంధరంగా పరుగెత్తినవి. ఐమూలలుగా ప్రసరించిన మార్తాండదేవుని కిరణజాలం హేలామనోహరంగా, వంపులు తీరిన వజ్రశలాకలవలె, వెన్నెలతీవలబెత్తాలవలె, ప్రాగ్దిశాకామినీవదనసరోజసంక్లిష్టమణితిలక ఘృణిఘుటికలవలె, ప్రసరించినవి. అనంతమధుర ప్రాగాకాశమాయమదిశమ్ము ఈశానదిక్పర్యంతము రంగారు రంగవల్లులు తీర్చిన సంక్రాంతి ముగ్గులవలె ముగ్ధరమణీయమైనవి. స్వర్గద్వారములు తెరచినట్లు, లోనికామధేనువిషాణకాంతిప్రరోహములు ముంగిట తళతళలాడినట్లు, కల్పవృక్షకిసలయమరీచికావీచికామేచకేతరనవాలోలబాల ప్రరోహసంతానమ్ము మధురచింతాసముద్గతభావనారూపముల వలె, తూరుపుముత్తైదువముంగిలి నలంకరించినట్లు తోచెను. సూర్యదేవునియేడుగుఱ్ఱములు బిలబిల బయలుదేరి తిర్యక్ప్రసార సముద్దీపితపురతః ప్రసరణహేలావల్గువల్గన చమత్కారఖురమధురశబ్దపరిరంజితములై సముద్దీపించెను)

**మాఘము—**

(ఏడవ వాడిట్లు చెప్పెను.)

నేను దోషినో కానో? నిర్ణయించవలసినది భగవంతుడు. మీరు విచారించవచ్చును. శిక్షించవచ్చును. దోష మేమియు లేదు. నే నీ లోకంలో బ్రతికియున్నాను. అది యింత వరకూమాట. బ్రతికిఉన్నానుగనుక కొన్ని పనులు చేయాలి. చేశాను. నేను చేసింది తప్పనకొంటే నేను చేసేఉండను. నే ననుకొన్నది తప్పు, మీరనుకొన్నది ఒప్పు, కావటం సాధ్యం కాదు. అయిన దైపోయింది. నన్ను బ్రతికించండని మిమ్మ బ్రతిమాలను. బ్రతిమాలినా మీరు బ్రతికించేది లేదు. ఆ బ్రతికించటం మీ చేతుల్లో లేదు. మీ రింకెవళ్ళచేతుల్లోనో ఉన్నారు. వాళ్లు మరింకెవళ్ళ చేతుల్లోనో ఉన్నారు. ఆ అసలు చేతులు కాలప్రవాహానివి. డామటన్ ను చంపానని నే ననను. దానికి కారణం కాల పురుషుడు. అతడు సర్వాధికారి. అప్పుడు నాచేత అట్లా చేయించాడు. ఇప్పుడు మీచేత ఇట్లా చేయిస్తున్నాడు. కాదు, ఈ దేశానికి అభ్యుదయం నేను కోరుతున్నానంటే, నేను కోరితే జరుగుతుంది—కోరకపోతే జరగదా! నా వంటివా ళ్లెంతమంది చచ్చారు? ఇంకెంత మంది చస్తారు. అందరూ నాకుమల్లేనే చావక్కర్లేదు. ఎవ డెట్లా చావలసిఉంటే వాడట్లా చస్తాడు. కొంత మీ దయవల్ల నే నిట్లా చస్తున్నాను. నా ఆత్మ ఈ దేశాన్ని పట్టుకొని ప్రాకులాడాలని నాకు లేదు. అసలు ఇంకా ఈ దేశ మెందుకు? అసలొక దేశ మెందుకు? అవునో! కాదో? మన కేమీ తెలియదు. నా కొక్కటే చింత. తరువాత ఏమిటో నే నింతవరకు విచారించలేదు. మీరు పెందరాడి నన్ను ఉరితీస్తే తరువాత యేమిటో తెలిసికోటానికి అప్పుడైనా వీలవుతుందేమో చూద్దామని ఉంది. నమస్కారం.

---

## సూక్ష్మంలో మోక్షం

(19 వ-పేజీ తరువాయి)

ఆ అమ్మాయిలలో మొదటిఆమె "పరమేశ్వరా! జగత్తుకంతకూ ధనమేకదా! మూలము. మళ్లీజన్మలో నాకు మరింత డబ్బున్న మగడు కావాలి! డబ్బున్నందుకు తనింత తిని ఎదుటివాళ్లకింత పెట్టి దానధర్మాలకోసం, మంచిపనులకోసం దానిని వినియోగించే ధర్మగుణం కూడా నా భర్త కుండాలి!" అని కోరుకుని బుడుంగున మునిగింది.

రెండోపిల్ల— "స్వామీ! ధనం శాశ్వత మయింది కాదు. విద్యవున్నట్టయితే ధనమూ, కీర్తీ దాని వెంబడే వస్తాయని పెద్దలంటూరు. కనుక మళ్లీజన్మలో విద్వాంసుడూ, పండితుడూ, కవీ అయినటువంటి భర్త దొరకాలి!" అని మునిగింది.

మూడవఆమె, "దేవా! నాకు విద్య,కీర్తి, ధనము అధికారం కలిగిన భర్త దొరికితే! మరేమీ వద్దు! కాబట్టి అటువంటి ఒకరాజును నాకు వచ్చే జన్మలో పతిగా చేయుము. తండ్రీ!" అని నమస్కరించి మునిగిపోయింది.

నాల్గవఆమె "ఇప్పుడు! వీళ్ళందరూ కోరుకున్నవి, అందంక్రింద రద్దేను. కనుక నాకు సౌందర్యం విద్యా ప్రతిభ అధికారం ధనం కల మొగుడు కావాలి" అని మునిగింది.

ఆ నలుగురు అమ్మాయిలూ మునిగిపోగానే పేదబ్రాహ్మణునకు కూడా ఏదో కోరిక కోరుకొని చనిపోద మని బుద్ధి పుట్టింది.

ఆఖరుకు "దేవా! నాది వక్కటే చిన్న కోరిక! ఇప్పడు కోరికలు కోరుకొని మునిగిపోయిన ఆ కాంతలకు నేను వచ్చేజన్మలో భర్తనయేట్లు అనుగ్రహించు" అని మునిగాడు.

వాళ్ల కోర్కెల ప్రకారం ఆ అమ్మాయిలు నాలుగురాజకుటుంబాల్లో పుట్టారు. బ్రాహ్మణుడు ధారానగరంలో సింధులమహారాజు కుమారుడుగా పుట్టాడు. మన దేశంలో కీర్తి గడించిన భోజమహారాజు ఈయనే.

ఆ నలుగురమ్మాయిలు సుగంధి, పద్మగంధి, కనకవతి, చంద్రప్రభ, అనే పేరులతో భోజమహారాజుకు రాణీలయ్యారు!

నవల:





శ్రీ నోరి నరసింహశాస్త్రి


## ౧౫

"వేశ్యాగృహేషు (సరసో) త్సవ జాతచేష్టాః
శబ్దానుకార శుకశారి కలోరుశబ్దాః
సర్వాదిశో ముఖరయంతి దివా విటానామ్
కందర్పదర్పతరలార్ణవఘూర్ణచంద్రాః"

హనుమత్కొండశాసనము

ఏకశిలానగరమున నా రాత్రి పండువెన్నెల కాయుచుండెను. వెన్నెలకు తోడై నగరమందంతట వెలుగుచున్న దివ్వెల కాంతితో ఆ రాత్రి పగలే యనిపించుచుండెను. నగరమంతట సమ్మర్దముగా జనులు సంచరించుచుండిరి. ఐనను అన్నివాడలకంటె ఆనాడు వేశ్యావాటిక యధికజాగృతమై విశిష్టమైన శోభతో నలరారుచుండెను.

ఆ పురమున రాచనగరితర్వాత ఎక్కువ విలాససంపదలు కలది వేశ్యలవాడయే. ఆనాటి వేశ్యల కలాకుశలత యిట్టి దని యూహింపదగినదే కాని వర్ణింప సాధ్యము కాదు. అప్పటి జీవితములో గ్రామమునుండి రాజధానీనగరమువరకు ఎల్లెడల వేశ్యలు ప్రముఖస్థాన మలంకరించుచుండిరి. రాజగురువు లగు శ్రీవిశ్వేశ్వర శంభుదేశికు లొక యగ్రహారము కల్పించుచు అందు పదిమంది నట్టువకత్తెలకును ఇరువురు ముఖరులతోగూడ ఎనిమిదిమంది మద్దెల వాదకులకును—ఈ పదునెనిమిదిమందికి ఒక్కొక్కరికి ఒక్కొక్క పుట్టిన్నర భాగ మేర్పాటుచేసెను. ఆంధ్రకవులు ప్రాయికముగా పురవర్ణనములలో ప్రత్యేకము వారవనితావర్ణనము చేర్చుటకు కారణము వారి భోగలాలసత యనదగదు. కరిషిం యగు తిక్కనామాత్యుడు అయోధ్యాపురములోని వారవనితల నీవిధముగా వర్ణించినాడు.

"మవ్వంపుమేనుల జవ్వనంబులకొంపు
మిగిలిన చెయ్వుల మెఱుగుపెట్ట
నల్లన మధురంపుసల్లాపరచనకు
లేతనవ్వున ననుబూత పూయ
నిడువాలుగనుదోయి నిసుపారు కాంతికి
గలికిక్రేగన్నుల నలువుమిగుల
లలితంబు లగు చిత్తముల చతురతలకు
సరసంపునడవడి దొరలువుచ్చ
వెరవు గల్గి మనోభవువీరరసము
నిరతముగ నేర్పువాటించి కరువుగట్టి
పోసిచేసిన రూపులపోల్కి వారవనిత
లొప్పుదు రప్పురవరమునందు."

ఇక యోగీశ్వరు డగు ఎఱ్ఱయ వైకుంఠపురములోగూడ స్త్రీలను వర్ణించుచు నక్కడ వారవనిత లుండుట యసంభావ్యము గనుక వారి వర్ణనమే స్ఫురింపజేయుచు నేమన్నాడు ?

"తమ వాడిమాడ్కి కందర్పున కేపనియైన
సాధించు దివ్యాస్త్ర మనగ
దమ తియ్యపలుకులు ప్రమదరాగాంబుధి
దనరారు మవ్వంపు దరగ లనగ
ధమ వింతచెయ్వులు కమనీయకోమల
శృంగారతరువు లేజిగురు లనగ
దమ ముద్దునవ్వులు తమకంబు జీకటి
నిగిడించు నరిదివెన్నెల లనంగ
జొక్కుమందు లనగ సోయగంబుల
గనులనగ సుఖము నిక్క లనగ జాలి
యనుపమానమూర్తులై యుల్లసిల్లుదు
రంబుజాయతాక్షు లప్పురమున."

మరి భక్తాగ్రేసరు డగు పోతన భోగినిని,

"విద్యావయోపేత సౌందర్యచాతుర్యవిఖ్యాత చంచద్గుణోపేత—" యిత్యాదిగా వర్ణించినాడు.

సభాపూజ్యు డగు పెద్దన ప్రవరాఖ్యు డుండు పట్టణమునే వర్ణించుచు—

"అచటి విలయాంధ్రు రంభాదు లైన నొరయ
గాసెకొంగున వారించి కడపగలరు
నాట్యరేఖాకళాధురంధరనిగూఢి..."

అని విలయాంధ్ర నందు చూపించినాడు.

మహాభోగమునను మహాయోగమునను స్వానుభవము గల

ధూర్జటి భక్తుఁ డగు ధూర్జటి శ్రీకాళహస్తిపురమున కామినీజనుల నిట్లు వర్ణించినాడు.

"పరిచితబంధనైపుణి, నపారకళానుభవప్రసక్తి, సా
దరసవివేకసంపద, సదాశుకవాక్యసుధానుభూతి, మో
హరహితవృత్తి, బ్రస్ఫురదనంగరహస్యవిచారబుద్ధి, న
ప్పురమున గామినీజనులు పొల్తురు యోగిజనంబుపోలికన్."

నిప్పాను దేశమున భరతఖండాచారముల ననుకరించు నాచారము లనేకము కలవు. అందు సకలకళాకుశల లగు 'గెషా' స్త్రీలు అనాదిగా గౌరవస్థాన మలంకరించుచుండిరి. ఓరుగంటిలోని వేశ్యవాటిక లెట్టివి? "విద్వేషిభువనవిజిగీషారంభవిజృంభమాణఝుషధ్వజభుజపరాక్రమసముత్సాహనాటకప్రస్తావనా ప్రథమ నాందీ శ్లోకంబు లగు వేశ్యవాటికానికటంబులు."

ఆనాటి వేశ్యలు పలువురు బహుకళాకుశలలు. వాత్స్యాయన ఋషి నాగరకవృత్తప్రకరణమున బేర్కొనిన గోష్ఠులు ప్రవర్తింపజేయుట కీ వేశ్యానివేశనములే ఆస్థానములు. శాస్త్రాభ్యాసము బుద్ధిపాటవము వాఙ్మాధురి సరసప్రవర్తనము ఏకత్ర సమకూడిన జనులు లేనిది యవి యెట్లు సాధ్యమగును? వేశ్యాభవనమునగాని సభామండపాదులందుగాని సమానము లగు విద్య బుద్ధి శీలము విత్తము వయస్సు గల వేశ్యలతో అనురూప మగు ఆలాపనములు ఆసనములు నొనర్చుట గోష్ఠి. ఆసమయముల వారు సమస్యల పూరింతురు. కావ్యసమస్యలు కళాసమస్యలు చర్చింతురు. ఆ చర్చ లైనపిదప పరస్పరానురాగాదరప్రదర్శనమునకై వస్త్రాదిదానము లొనర్చుకొందురు. మరియు ఆపానకగోష్ఠులు ఒకమా రొకరి యింటను మరొక పర్యాయము మరొకరి యింటను పరస్పరభవనములలో సాగుచుండెడివి. ఆసమయముల మధుమైరేయములనే గాక వివిధలవణములు ఫలములు తిక్తకటుకామ్లము లగు భక్ష్యములను వేశ్యలచే నారగింపజేసి తా మారగింతురు. మరియు నొక్కొకచో పూర్వాహ్ణముననే నాగరకుడు అశ్వముపై నెక్కి ముందువెనుకల వేశ్యల నిడికొని విభవానుసారముగా పరిచారకు లనువేష్టింప బయలువెడలి వనవిహార మొనరించి కోళ్ల గొఱువంకల మేషముల యుద్ధములు దర్శించి ద్యూతముతోడను నాట్యకేళీవిలాసాదులతోడను ప్రొద్దుపుచ్చి యపరాహ్ణవేళయందు తమ వనవిహారము ప్రదర్శించునట్లు శిరఃకర్ణకంఠప్రదేశములలో పూగుత్తులును కిసలయములును అలంకరించుకొని మరల గృహాభిముఖుడై వచ్చుచుండును. గ్రీష్మకాల మైనచో జలక్రీడల కట్లే యేగుదురు. మరియు నాయా పర్వసమయములలో యక్షరాత్రికౌముదీజాగరము అశోకోత్తంసిక ఇక్షుభంజిక మొదలగు నెన్నియేని గోష్ఠీక్రీడలు ప్రవర్తింపజేయదగిన వున్నవి. ఈ గోష్ఠీసమయములలో ధనవంతు లగు నాగరకులే కాక ధనము కోల్పోయిన విదగ్ధులుకూడ ఉపనాగరకులై పాల్గొనవచ్చును. అంతే కాదు. గ్రామవాసులుగూడ నందు చేరదగుదురు. ఈ గోష్ఠీసందర్భములలో ప్రయోగించు భాషలోకూడ నియమము కలదు. ఆయెడ నత్యంతసంస్కృతము కాని అత్యంతము దేశభాషగాని అవలంబింపక మధ్యేమార్గమున ప్రవర్తింపవలెను. లోకవిద్విష్టములును స్వైరవిహారము గలవియు పరహింసాత్మకములును అగు గోష్ఠులను వాత్స్యాయనుడు నిషేధించినాడు. కాని లోకమునం దందరు బుద్ధిమంతులే యుందురా?

విద్యావతు లగు నంగనలు నాగరకుల భోగములకే కాక రాజకీయవ్యవహారములకు గూడ వైభవముగల దేశములలో అవసరమై యుందురు. దూరదేశములలో రాయబారములు జరుపువారు స్వయముగా సమర్థు లగుటయే కాక వారి భార్యలునుగూడ విద్యావతులును సుందరాంగులును చతురలును ఐయుండు టవసర మనునది రాజ్యతంత్రజ్ఞులకు క్రొత్త కాదు. పాశ్చాత్యదేశములలో సంపన్నలును విద్యావతులును నగు యోషిద్రత్నములు విందు లను మిషతో తమ భవనములకు కవులను గాయకులను చిత్రకారులను ప్రభువులను ఆకర్షించి తా మానందించి వారి నానందింపజేయుటయు అట్టి యోషలలో ఒకరి కొకరికి స్పర్థ లుండి ఒకరిని మించి యొక రుండవలె నని ప్రసిద్ధస్త్రీపురుషాదుల నాకర్షించుమార్గము లన్వేషించుచుండుటయు లోకవిదులకు క్రొత్త కాదు. అట్టి గోష్ఠులే కవితాశిల్పప్రపంచమునకే కాక రాజకీయప్రపంచమునకుగూడ ఉత్సాహ మొనగూర్చు కేంద్రములుగా నుండును.

భరతదేశమున కులస్త్రీ లెంత విదుషీమణు లైనను వారిని ఇట్టి జనోపయోగకార్యములకు ఉపయోగించు నాచారము లేదు. అందుచే ఈ ప్రయోజనములు సాధించుటకు వారవనిత లుపయోగపడెడువారు. వారకాంతలు వెలయాండ్రే కారు, వారే విదుషీమణులు, కలాకుశలలు, కవిత్వప్రవర్తకలు, విద్వజ్జనాభిమానలు. ఒక్కొక్కచో మహాభక్తురాండ్రు. గీతగోవిందకారు డగు జయదేవుడు భక్తాగ్రేసరు డైనచో మద్దుపలని యాతనికి భక్తిలో తీసిపోవునా? వారవనితలలో మహాభక్తురాండ్రు కలరు; యోగినలు కలరు. ఆ యనుభవ మున్నందుననే ధూర్జటి కామినులకుయోగినులతో అభేదాధ్యవసాయము చేసినాడు. వారు మరియు రాజ్యతంత్రములో కీలకప్రాయలు. నిర్వీర్య మగు కాలములందును రాజ్యములందును సంఘములందును పూర్వము పటుత్వ మొనగూర్చిన సంస్థలే హీనస్థితిని పొందును. ఆ హీనస్థితిని బట్టి ఉత్తమకాలములలో నున్న యీ వ్యవస్థలను నిందింపరాదు. తిక్కనాదిమహాకవులు వేశ్యాజనమున కింతటి ప్రధానస్థాన మిచ్చియుండుట వారి కా కాలమున గల యథోచితస్థానమే. కేవలము భోగలాలసులు శరీరకండూతి తీర్చుకొనుటకే ప్రధానముగా నుపయోగపడు పతితవృత్తి నుద్దేశించి వా రట్లు వర్ణింపలేదు. అందుచే ఏకశిలానగరమందలి వేశ్యవాటికలోనికి కవులు విదగ్ధులే కాక నీతివిదులును పండితులును శిష్టంమన్యులును ప్రవేశింప జంకరాదు. ఒక్కసారి యీ వేశ్యలవాడలో కాల్యము లేకుండ బ్రవేశించి చూచివత్తము. అందులో ఇది మహాపర్వము!



# మన రాజ్యాంగము గాంధేయమా?

మన రాజ్యాంగప్రణాళిక గాంధేయ మానా కాదా అన్న ప్రశ్నకు సమాధాన మిచ్చుకొనేముందు, రాజ్యాంగప్రణాళిక అన్నది: ఒక రాజ్యం పరిపాలించబడే విధానములోని మూలప్రాథమికసూత్రాలను మాత్రమే సూచిస్తుందనీ, కొన్నిచోట్ల మాత్రం, పరిపాలనాయంత్రభాగాలైన ఉద్యోగవర్గ, న్యాయపాలన, శాసననిర్మాణ శాఖా కార్యక్రమాల అవకాశాలను విశదంగా నిరూపిస్తుందన్నీ, **బాగా అవగాహన చేసికొని ఉండాలి.**

ఏ రాజ్యాంగప్రణాళికా కూడా, ఒక రాజకీయవాదాన్ని మాత్రం సమర్థించే సంహిత కాజాలదు. అయితే ఆ రాజకీయ వాదంలోని సిద్ధాంతాలు రాజ్యాంగప్రణాళికరచనలో కొన్ని భాగాలమీదగాని లేదా ప్రణాళికఅంతటిమీదాగాని తమ ప్రభావం నెరపించుకొనిఉంటే ఉండవచ్చును.

ఈ దృక్కోణంనుంచి గనక చూడగలిగినట్లయితే, గాంధీమహాత్ముని సిద్ధాంతాలు కొన్ని యథాతథంగా నూతనరాజ్యాంగ

ప్రణాలికలో ప్రవేశించాయని చెప్పవచ్చును. మనరాజ్యాంగప్రణాలికరూపవిలాసాలను బట్టి ఈ ప్రణాలికలో మహాత్ముని వేదాంతము అంగాంగికంగా జీర్ణించిందని తేలికగానే తెలియగలదు.

మహాత్ముని జాతీయోద్యమప్రణాలికలో మూడుముఖ్యాంశాలపైననే, తన జీవితపర్యంతమాతృదేశ సేవకాలమంతటా మహాత్ముడు ప్రాధాన్యమిచ్చి కృషిచేశాడు. (1) ఖాది (2) అస్పృశ్యతానివారణ (3) హిందూముస్లిం ఐకమత్యత. మనరాజ్యాంగప్రణాలిక ఈమూడు అంశాలకూ కూడా గౌరవప్రదమైన స్థానమే ఇచ్చిందని నిస్సందేహంగా చెప్పవచ్చును.

రాజ్యాంగవిధానానికి సూచీదర్శకమైన సూత్రాలలోనే, ‘ఖాదీకి’ మకుటాయమానమైన స్థానం లభించింది.–“వ్యక్తిపరంగాగాని సహకారవిధానయుతంగాగాని పల్లెలలో ప్రబలే కుటీరపరిశ్రమలన్నిటినీ వృద్ధిపరచగలందులకే ప్రభుత్వము ప్రయత్నిస్తుంది” (43. ఆర్టికిల్)

ప్రాథమికహక్కుల అధ్యాయంలోని 17 వ నిబంధన, “అస్పృశ్యతకారణంగా, కలుగచేయబడే అవరోధాలన్ని నేరాలుగానూ, 5 చట్టప్రకారంగా శిక్షార్హాలుగానూ ప్రవచించింది. ఈవిధంగా రాజ్యాంగం కోట్లకొలది నిమ్నజాతిప్రజలకు స్వేచ్ఛాస్వాతంత్ర్యాల నిచ్చి విముక్తులను చేసింది.

రాజ్యాంగంలో, సంయుక్త నియోజక ప్రాతినిధ్యాలు ఏర్పరచటంతో హిందూ ముస్లింసఖ్యతాబంధము మరింత దృఢమయింది. మతకలహవిప్రణాని కింతతో భారతరాజ్యంలో స్థానం లేకుండా పోయింది:—

మహాత్ముని భారతదేశము

మహాత్ముని ఆదర్శాలనుగాని, వేదాంతాన్నిగాని సూక్ష్మీకరించి చెప్పటం కష్టం. ఆయన నిర్మాణకార్యక్రమానికి ముఖ్యాంగాలుగా పెట్టుకొన్న పై మూడు విషయాలకోసమేకాక, అనేకవివిధ విషయాలకోసం ఆదర్శాలకోసం కృషిచేశాడు. సత్యాహింసల వెలుగులో భారతదేశాన్ని భారతీయసంఘాన్ని తీర్చిదిద్దటానికి కృషిచేశాడు. తను కోరే భారతదేశం ఏదో వివరించాడు.

“ఎంతటి బీదవాడైనను, ‘ఇది నాదేశము, దీని నిర్మాణములో నా మాటకుకూడ తగిన స్థానమున్నది” అని భావించగల భారతదేశమునకై నేను కృషి చేసెదను. ఉత్తమతరగతి, అథమతరగతి అన్న విభేదములేని భారతదేశమునకై నేను కృషి చేసెదను. సర్వమతస్థులు సంపూర్ణ సామరస్యముతో

జీవించగల భారతదేశమునకై నేను కృషి చేసెదను. ఆ భారతదేశములో అస్పృశ్యతకు తావులేదు. మధు మత్తుపదార్థముల సేవాదోషమచట లేదు. స్త్రీలకు పురుషులకు సమానహక్కులుండును... నేను కలలు గాంచు భారతదేశస్వరూప మిది." అని మహాత్ముడు పేర్కొన్నాడు.

ఇక యథార్థరాజకీయదృష్ట్యా, మహాత్ముని ప్రణాళికసిద్ధాంతాలను ఇల్లా సూత్రీకరించవచ్చును.

(1) భారతదేశము సమైక్యమైన ఏకజాతిగా కావాలి. అక్కడ సర్వమతాలకు సమత్వము భాసించాలి. జాతి, కుల, మత, వర్గ, లింగవిభేదాలకు అక్కడ స్థానం లేదు. సర్వసంస్కృతుల వికాసానికి అక్కడ పరిపూర్ణస్వాతంత్ర్య ముండాలి.

రాజ్యాంగప్రణాళికను ఒక్కసారి పరికిస్తే ఈ ఆదర్శం అందులో సంపూర్ణంగా ఇమిడి ఉందని తెలుస్తుంది. ప్రాథమిక హక్కుల అధ్యాయంలో 25వ నిబంధన ప్రకారం ఏవ్యక్తి అయినా తన స్వమతాన్ని, స్వ ఆరాధనని స్వేచ్ఛగా సాగించుకొనేందుకు పరిపూర్ణమైన హామీ ఇయ్యబడింది. 29,30 నిబంధనలలో, అల్పవర్గాల, విద్య సంస్కృతులను, భద్రపరచగల హామీ ఒసంగబడింది. ఆవిధంగా రాజ్యాంగం ఏకమతఆధిక్యదృష్టిని రహితమొనర్చి, సర్వమత, వర్గప్రజలకు రాజ్యంలో రక్షణనిచ్చింది.

ప్రజాక్షేమం

(2) భారతదేశము, కర్షకుడు, కార్మికుడూ కూడా, దోపిడీకి గురికాకుండా స్వేచ్ఛగా అభివృద్ధిపొందగల సంపూర్ణావకాశమున్న కిసాన్ మజ్దూర్ రాజ్యం కావాలని కోరాడు.

21 సంవత్సరములు దాటిన వయోజనులందరికీ ఓటింగ్ హక్కు కలదనటంలోనే, ఈరాజ్యాంగము మహాత్ముని కలను యథార్థంచేసింది.

పరిపాలనవిధానసూచీసూత్రాల అధ్యాయంలో 39 నిబంధనప్రకారము ప్రతిపౌరునికీ సముమైన జీవనం ఏర్పరచవలసిన బాధ్యత ప్రభుత్వానికున్నది. "దేశసంపద సర్వస్వాన్ని, సర్వప్రజల క్షేమంకోసం వినియోగించాలని ఉంది. దేశఆర్థిక సౌభాగ్యం, డబ్బు ఒకచోట పెరిగి ఒకచోట తరిగే విధానంలోకాక, అందరి సౌభాగ్యానికి వినియోగపడాలని ఉంది. స్త్రీలైనా పురుషులైనా సమమొత్తమైన రాబడిఉండాలని నిర్దేశించింది. స్త్రీ, పురుష శిశుకార్మికుల, ఆరోగ్యానికి భంగంగా కృషి చేయించకూడదన్నది. వ్యక్తుల ఆర్థికఅవసరాలు ఆసరాచేసుకొని ఈడుకు, శక్తితత్వానికి మించిన సరిపోని పనులను, ఏవ్యక్తులచేతా చేయించకూడదని సూచించింది. వ్యక్తులకృషిని భాగ్యాన్ని ఆర్జనాశక్తిని నైతికతత్త్వాన్ని ఇతరులు దోపిడీచేసేందుకు ఆస్కారముండకూడదని చెప్పుకొంది శిశువులకు నిర్బంధవిద్య, స్వయంకృషికి ఆస్కారము, అశక్తస్థితిలో అవసరసహాయము, భీమా, తదితర సహాయాలు మొదలైనవన్నీ తక్కిన వివిధనిబంధనలలో సూత్రీకరించింది.

నిమ్నజాతులు, తదితర వెనుకపడ్డవర్గాలకు, విద్య, ఆర్థికంగా బాగుపడేందుకు ప్రత్యేక సహాయాలు, సాంఘికంగా అన్యాయం జరుగకుండా రక్షణ. తక్కినవారితో సమస్థాయికి రాగలిగేందుకు వారికి ప్రత్యేక సౌకర్యాలూ, స్వాతంత్ర్యాలూ, 330-342 నిబంధనల ప్రకారం రాజ్యాంగప్రణాళిక ఏర్పరిచింది.

మద్యనిషేధము, పంచాయితీలు, గోసంరక్షణ

(3) ఆర్థికంగా వెనుకబడిఉన్న వర్గాలు మద్యపిశాచానికి వశులై పీడించబడకుండా మద్యపానాన్ని ప్రభుత్వం నిషేధించాలని మహాత్ముడు వాంఛించాడు. ఆరోగ్యానికి అవసరమైనచోట్లతప్ప, మత్తుపదార్థాలూ, అనారోగ్యం కలగచేసేమందులూ, అన్నిటి సేవాకూడా ప్రణాళికప్రకారం నిషేధించబడింది.

(4) గ్రామప్రజానీకంతో ఐక్యభావం ఏర్పరుచుకొని, భారతరాజ్యాంగానికి గ్రామపంచాయితీవిధానం ఆయువుపట్టుగా ఉండాలని మహాత్ముడు వాంఛించాడు.

రాజ్యాంగప్రణాళికలో గ్రామపంచాయితీలు ఏర్పడి, అవసరమైన అధికారాలతో స్థానికప్రభుత్వాలుగా వ్యవహరించాలని సూచించబడింది.

(5) గ్రామసుల ఆర్థికపరిస్థితిని బాగుచేసే ఉద్దేశంతో దేశపశుసంపదపై జాతిదృష్టిని కేంద్రీకరించేటట్లు చేశాడు మహాత్ముడు. గ్రామపశుసౌభాగ్యాన్ని నవీన శాస్త్రీయ పద్ధతులలో సహకారవిధానాలలో పెంపొందించాలని రాజ్యాంగప్రణాళిక 48వ నిబంధన ప్రవచించింది.

జాతీయభాష

జాతీయ వ్యవహారాలన్నిటికి, హిందీని (లేక హిందూస్థానీ) ఆంగ్లభాషస్థానే వాడాలని గాంధీజీ సూచించాడు. అదేస్థాయిలో రాష్ట్రమాతృభాషలను కూడా గౌరవించి పెంపొందించాలని చెప్పాడు. అయినా ఏభాషఅయినా, ఆంగ్లమయినా ద్వేషం ఆయన చూపలేదు. లిపి దేవనాగరి ఉర్దూలలో ఉండవలెనని ఆయన అన్నది. దేశవిభజనతో, రెండులిపులవాదనకు కొంత బలం తగ్గింది.

రాజ్యాంగప్రణాళికలో జాతీయభాషకు స్థానం ఇయ్యటంలో మహాత్ముని సహన ప్రవృత్తికి నిదర్శనంగానే స్థానమిచ్చారు. దేవనాగరిలిపితో హిందీజాతీయభాషకావాలని ప్రణాళిక చెపుతుంది. మధ్యకాలంలో 15 ఏళ్ళదాకా ఉద్యోగవ్యవహారాలకు ఆంగ్లం వాడవచ్చునని ఉసులుబాటు ఇచ్చింది.

1955 నాటికి హిందీ రాజకీయంగా వ్యవహారంలోకి వచ్చేటట్లు అధ్యక్షుడు చూడాలని సూచించింది. ఏరాష్ట్రంలోనైనా మాతృభాషగాని హిందీని, సాధికారభాష అయేందుకు ఆస్కారం ఇచ్చింది.

ప్రపంచశాంతి

(7) అంతర్జాతీయవివాదాలలో యుద్ధప్రమేయాన్ని నిషేధించాలని మహాత్ముడు ఆశించాడు. అహింసామూర్తి సత్యాగ్రహనిర్మాత అయిన ఆయన ఏవిధమైన హింసనైనా వ్యక్తిగతంగాని, దేశగతంగానీ, ఎదిర్చి, అచంచలంగా నిలచాడు. ఈ సిద్ధాంతాన్ని రాజ్యాంగప్రణాళికనిర్మాతలు ప్రణాళిక 51వ నిబంధనలో, ఈ రాజ్యము అంతర్జాతీయశాంతిభద్రతలను పెంపొందించేందుకు, జాతులమధ్య న్యాయమైన గౌరవనీయమైన బాంధవ్యాలు నిలపేందుకు, అంతర్జాతీయన్యాయచట్టంపై, పరస్పర ఒడంబడికలపై, గౌరవం కలిగి వ్యక్తులుగాని దేశాలుగాని వ్యవహరించేందుకు, మధ్యవర్తిత్వాలకల్ల అంతర్జాతీయవివాదాలు సమసిపోయేందుకు కృషిచేస్తుంది" అని సూత్రీకరించుకొంది.



# తాళ్ళపాకవారి పదములు

శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ

## ౪౩

(సంపు. ౨ : పదం. ౧౪౮)

పాడిరాగం - త్ర్యస్ర త్రిపుటతాళం

[పల్లవి]

(౧) ,, ధ పా పా। మ ప ధా ప ధ ప మ రీ। , స రి స రి మా రీ । సా ని స రి సా
వే ఱొ క్క రు లే రు వి శ్వ మం తా నీ మ హి మే

(౨) స రి మ ప ధ పా ప మ ప ధ। ప ధ ప ధ ప ధ ప ధ ప మ రీ। , స రి స రి మ ప ప మ రీ।
వే ఱొ క్క రు లే రు వి శ్వ మం తా
స రి స రి స ని స రి. సా।
నీ మ హి మే

(౩) స రి మ ప ధ పా ప మ ప ని। సా , రి స ని ప ధ ప మ రీ। , స రి స రి మ ప ధా।
వే ఱొ క్క రు లె రు వి శ్వ మం తా
పా ధ ప మా ప మ రీ స రి సా
నీ మ హి మే

[అనుపల్లవి]

(౧) ,, స రి మా పా। ప ధా ధ ప మ రి మ పా
ఏ రీ తి నీ వె క ల వు

(౨) ,, స రి స రి మ రి రి మ ప రి। స రి మ ప ధా ప ధ ప మ పా
ఏ రీ తి నీ వె క ల వు

(౩) ,, స రి స రి మ రి రి మ ప మ। ప ధ ప మ రి మ ప స నీ
ఏ రీ తి నీ వె క ల వు

(౪) ,, స రి స రి మా ప మ రి మ పా ధ ప। ప ధ ప ప మ ప ప ధ ప స రీ
ఏ రీ తి నీ వే క ల వు
, మా రి మ రి స సా స ని ప ని। స రి స ని ని స ని ప ప ధ ప ప మ రి॥ స రి మ ప (వేఱొక్క)
ఇ త ర ము లె రు

[చరణం]

,, ధ పా , ధ ప మ మా | మా , మా , మా పా మ ప ధ ప మా
త ల్లి వై ర క్షిం తు వు

,, రి మ మ రి మ మ రి | సా రి రి స ని ని స రీ సా
తం డ్రి వై పో షిం తు వు

,, స రి మా పా | పా ధ పా ధ ప మ ప ధ పా
ఇ ల్లా ల వై మో హ

,, మ పా ధ ప మా ప ధ ప మ మా , | ప మ రి రి మ మ పా , ,
మి త్తు వు మా రు

,, సే సే ని పా పా ధా ధ ప మా | ప నీ సే ని సే రి సా
ఒ ళ్ళై పె రు గు దు

, సా రి సే సా , రి సా , రి | స రి స మ రీ స ని స రి సా
వొ గి బు రా కృ త మూ ను

,, రి రీ సే రి మా | రి సే ని పా పా రి సే రీ
వి ల్లు ముం గి లై యుం దు

,, రి స రి మ ప సా , ని | ప మ ప ధా , పా ధ ప మా మా ప మ రీ || స రి మ ప (వేడొక్క–)
విం తా నీ మ హి మే

ఇట్లే క్రిందిచరణములు :

(౨) గురుడవై బోధింతువు – కొడుకవై యీడేర్తువు ;
అగాధైనిధానమ – పొదువు నీవే ;
దొరవైనన్నేలుదువు – దూతవై పనిసేతువు ;
ఇరవైన సిరు లిత్తు – వింతా నీమహిమే (వేడొక్క–)

(3) దేవుడవై పూజగొందు – దిక్కు ప్రాణమౌదువు,
కావలసినట్టౌదు – కామించినట్లు ;
శ్రీ వేంకటేశ నీవె – చిత్తములోపలనుండి,
ఈవల వైకుంఠ మిత్తు – వింతా నీమహిమే (వేడొక్క–)

**అఘుటీక :**

ఒళ్ళై= శరీరమై; ఒగిన్= క్రమముగా ; పురాకృతము = పూర్వజన్మకర్మము ; నిధానము= నిధి ; ఈవల= ఈలోకమందే. నీవు హృదయమం దున్నప్పుడు ఈలోక మే వైకుంఠపదవిగా తోచునన్నమాట.

# భారతదేశ ఆహారపు కొరత

## [ఆండ్రూరాత్]

భారతదేశం "రిపబ్లిక్" అవుతోంది.

కాని అనేకమంది భారతీయులు, కాళీ విస్తళ్లతో, ఇంట గింజలేక, రేషనుషాపులు వట్టిపోయి, కాలే కడుపులతో, ఆకాశంవంక అర్రులు జాస్తూ చూస్తూన్నారు. పల్లెటి దిశలలో పర్యటనఫలంగా నాకు కనిపించిన దిదీ! ఒక కుగ్రామంలో ఒక కర్షకుడు, ఒకచేత్తో నడినెత్తికి వచ్చిన సూర్యుడిని చూపిస్తూ, రెండోచేత్తో అక్కళించుకొని పోయిన తన కడుపు మీద తట్టుకొని, "సూర్యోదయంనుంచి ఇప్పటిదాకా పని చేస్తున్నాను. ఇంతవరకు ఎంగిలిపడలేదు. ఎంగిలి పడటానికి నా గుడిసెలోకూడా ఏమీ లేదు"అని దీనంగా చెప్పుకొన్నాడు.

మరొక ఊళ్లో, ఒక తలపాగాచుట్టిన రైతును, భారతరాజకీయాలను గూర్చి ప్రశ్నించాను "అవన్నీ చదువుకున్నోరికీ, పట్టణాల్లో ఉండేవాళ్లకూ తప్ప మాకు తెలియవు. నాకు తెలిసిందల్లా ఒకటే. రోజంతా పనిచేస్తాము గాని మాకు కడుపుకు కూడు, కట్టుకొనేందుకు గుడ్డా, చాలిలేవు" అని మాత్రమే అన్నాడు.

దేశప్రజలో నూటికి 80 మంది వ్యవసాయంలో నిమగ్నులైన దేశంలో, సహస్రాబ్దాలుగా వ్యవసాయం దేశజీవనమైన దేశంలో, ప్రజకు పోషించచాలినపంట లేకపోవట మేమిటో ?

అనావృష్టి, మొక్క పురుగుపట్టటం, దొంగనిల్వలు, జనాభా అతిత్వరగా పెరిగిపోతూండటం, ఇన్నీ కారణాలే కావచ్చును. కాని బాగా పరిశీలించగా చివరికి తేలే విషయం - ఇవన్నీ ప్రజల అవసరాలను తీర్చలేని పాతపడ్డ వ్యావసాయికపద్ధతి బండారాన్ని బైలుపెట్టిన కొత్త కష్టాలు మాత్రమే. అసలు లోటు వ్యవసాయవిధానంలోదే.

ప్రస్తుతపరిస్థితిలో అన్నిటికన్న ఆశ్చర్యం కల్గించేవిషయం ఒకటుంది. ప్రభుత్వ ప్రణాళికలు, ప్రభుత్వసంఘాలూ, ప్రభుత్వనిపుణులూ, అంటూ పెద్ద ప్రతారణంతో, ధాన్యసేకరణవిధానమంటూ ప్రభుత్వం గొప్పగా ప్రకటించుకొంటున్న, దేశంలో ఆహారధాన్యం, ప్రభుత్వపు షాపులలో కాక, కొద్దిమంది కుచ్ఛితులైన బ్లాక్ మార్కెటువర్తకుల గిడ్డంగులలో కుళ్లుతూంది. ఆహారంకొరత ఆధారంచేసుకొని, ఈవర్తకులు బంగారం పండించుకొంటున్నారు.

భారతదేశంలో వ్యవసాయ విధానం, హీనాతిహీనమైనస్థితిలో ఉంది. భారతదేశపురైతు, తక్కినదేశపురైతులకన్నా, అదేమాదిరిపొలాలలో చాలా తక్కువ పండిస్తున్నాడు.

అంతకన్నా కనాకష్టమైన విషయం ఏమిటంటే—ఆ పండించిన స్వల్పంలోనే అతనికి దక్కేది, మరీకొద్ది. ఇది అర్థంచేసికోవాలంటే దేశపూర్వచరిత్రను ఒక్కసారి పరికించుకోవాలి.

బ్రిటిష్‌వారి రాకకు పూర్వం కూడా, ప్రతిపౌరునికీ "శ్రీలుపొంగిన జీవగడ్డై, పాలుపారినభాగ్యరాశి" కాలేదు. పరాయివాళ్లంతా సుభిక్షమైన దేశమనే ఐక్యకంఠంతో అన్నారు. అందుకనే, డచ్చి, పోర్చుగీస్, ఫ్రెంచి, బ్రిటిష్, సామ్రాజ్యపిపాసుల కందరికీ ఈదేశంపైన కన్ను పడింది. 18 వ శతాబ్దాంతంలో బ్రిటీష్‌పార్లమెంటు సభ్యుడైన విలియంపుల్లర్‌టన్, బెంగాలును వర్ణిస్తూ, "వర్తక, వాణిజ్య, సంపద్విభవాలకు, ప్రాచ్యఖండానికంతకూ వంగదేశం ఆటపట్టు" అని వర్ణించాడు. అంతకు కొంత పూర్వమే రాబర్టుక్లైవ్, మూర్షిదాబాద్‌ను, "వైశాల్యం, జనసంఖ్య, ధనసంపత్తులలో లండనుకు దీటైననగరం" అని వర్ణించాడు.

ఆ రోజుల భారతదేశం, స్వయంసమృద్ధమైన గ్రామపాలనవిధానం మీద ఎక్కువ ఆధారపడింది. "ఏఊరిపంట ఆఊరుపండించుకొంటే, అక్కడి కుటీరజీవనవృత్తు లన్నిటినీ అక్కడే పోషించుకొంటూ గడిపేసి గ్రామం ఉమ్మడిగా ప్రజల సొత్తైఉండేది. ఎవరికివారు తమ కొద్దిభూమిలో సేద్యంచేసి పండించుకొంటూ, గ్రామం అంతా కలిసి ఉమ్మడిగా జమీందార్‌కో, రాజుకో, నీటివసతులు, రక్షణలు కల్పించగలందుకై శిస్తు చెల్లించుకొనేవారు.

పారిశ్రామికంగా తలఎత్తని బ్రిటన్‌కు భారతదేశం తన సరుకుఅమ్మకానికి తగ్గ బజారుగానే ముఖ్యంగా గోచరించింది. పల్లెటిపరిశ్రమలను పడగొట్టేందుకు తాము యాంత్రికంగా తయారుచేసిన వస్తువులను ఇక్కడ చౌకగా అమ్మటమే పనిగా పెట్టుకొని కులవృత్తు లన్నిటినీ రూపుమాపారు. పల్లెటిదిక్కును స్వయంసమృద్ధంగా ఉంచుతూవచ్చిన ఆహారపుపంటల మీదకాక, ఈ విలాసవస్తువులను సేకరించుకొనేందుకు ఎక్కువధర తెచ్చే పొగాకు మాదిరి పంటలకోసం రైతులు ఎగబడేస్థితిని దేశంలో తీసుకొచ్చారు. తత్ఫలితంగా, గోగు, కిత్తనార మొదలైన అనవసరపు పంటలు చలామణీలోకి వచ్చి, ధాన్యంపండించే ఎకరాలసంఖ్య తగ్గిపోతూవచ్చింది. ఆహార అవసరాలు పెరిగినా, పంటల్లో ఈ తీతకట్టు అల్లాగే మిగిలింది.

బ్రిటిష్‌వారికి దేశంలో రాజకీయ ప్రాబల్యం చిక్కేటప్పటికి, రైతుకూ ప్రభుత్వానికీ మధ్య, భూస్వాములను తయారుచేశారు బ్రిటిష్‌వారు. రైతులను అదుపులో ఉంచటం, ప్రభుత్వానికి పన్నులు వసూలు చేసి పెట్టడం, రైతులను పిండి తమ జేబులు నింపుకోవటంగా తయారైంది వీరి పని. పాశ్చాత్యదేశాలలోని కేపిటలిస్టు భూస్వాములకూ వీళ్లకూ తేడా ఉంది. వీరు వ్యవసాయానికి గాని, తదభివృద్ధికి గాని కించిత్తైనా తమ కష్టాన్ని గాని, తమ ధనాన్ని గాని, విద్వత్తును గాని, ఆఖరుకు తమ విత్తులు, ఎరువులుగాని ఉపయోగించవలసిన పని లేక పోయింది. కేవలం చీడపురుగులలాగే బ్రతక వీలయింది.

కొద్దిమాత్రం భూమి మిగుల్చుకోగల్గిన చిన్నరైతులు, తమదగ్గిర ఉపకరణాలుగాని, ఎరువులుగాని, కొత్తవిజ్ఞానంగాని ఏవీ లేక,

ఎక్కువ పండించటానికి సమర్థులు కాక పోయారు. తమ వ్యవసాయ పద్ధతులు రెండుశతాబ్దాల పాతవనీ, కొత్త పద్ధతులలో వ్యవసాయవిధానం పెరిగిందన్న విజ్ఞానాన్ని గాని వారికి తెలిపేవారే లేక పోయారు. పంటభూమి చాలాచోట్ల చిన్న చిన్న విడిచెక్కలుగా ఉంటుంది. అందులో నూటికి 60 వంతులు ఆర్థికంగా స్వయం సమృద్ధంగాని చిన్నిపంట చెక్కలే! వీట్లను దున్నటానికి పురాతనపు కఱ్ఱనాగళ్ళనే పురాతనపు పద్ధతులలోనే వాడుతారు. ఈ వ్యవసాయవిధానంలో, ముఖ్యాంగము, రైతుశరీరకష్టము ఒక్కటే - కాని ఈ రైతు స్థితి అధ్వాన్నంగా ఉండటంతో, ఆహారపు పంటకూడా అల్లాగే దెబ్బతింటూంది. అర్ధాకలితో, అనారోగ్యంతో, నిర్గనుడై, విద్యలేని వ్యక్తి అపారమైన శక్తితో వ్యవసాయం చేయగలడని ఆశించటం భ్రమ మాత్రమే.

సేద్యపు పద్ధతులు, ధాన్యసేకరణమూ, కూడా బందోబస్తులుగా చేయటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఇండియాలో శేషనువిధానాన్ని, కొద్దిరోజుల క్రింద ఇండియాలో నాలుగురోజులపాటు ఉండి వెళ్లిన ఒక అమెరికన్ సంఘం అతిగొప్పగా పొగిడేసింది. కాని ఈవిధానానికి కాగితాల మీద కనపడే శ్రేష్టత్వం ఆచరణలో కన్పడదు.

ధాన్యసేకరణవిధానానికి ఆయువుపట్లు పల్లెలేకదా! అక్కడి ధాన్యసేకరణవ్యవహారమంతా స్థానికగ్రామోద్యోగుల చేతుల్లో ఉంటుంది. వాళ్లు అక్కడి మోతుబరి భూస్వాముల మీద ఆధారపడినవాళ్లై ఉంటారు. అందుచేత అక్కడివారి పలుకుబడిని, లాంఛనాలను, వాళ్ల సౌకర్యాలను గమనించేందుకు తరుచు చెయ్యితడుపుకొని బీదవాళ్లపొట్ట కొట్టవలసివస్తూంటుంది.

కొత్తగా కొన్ని నీటివసరులు కల్పించటం, కొన్ని కృత్రిమఎరువుల ఫ్యాక్టరీలను నిర్మించటం జరుగుతూన్నమాట నిజమే. కాని ఈ సంస్కరణలన్నీ కలిసినా ఇప్పటి పంటను నూటికి పదివంతులుకంటే పెంచలేవు.

ఇంతకన్నా నవీనవిధానంలో మంచిపద్ధతిలో, అధికోత్పత్తికి వ్యవసాయాన్ని మార్చుకొంటేతప్ప, సుదీర్ఘంగా భారతదేశ సౌభాగ్యము, నిలువగల ఆస్కారము లేదని, వ్యావసాయికనిపుణులు చాలామంది ఏకాభిప్రాయాన్ని వెలువరుస్తున్నారు. పెద్దపెద్ద భూఖండాలను ట్రాక్టర్లను ఆధునిక వ్యవసాయయంత్రసామగ్రిని ఉపయోగించి, అధికంగా పండించుకొంటేనేతప్ప ఇది సాధ్యముకాదు. కాని యంత్రసేకరణ ముందెప్పటిమాటోతప్ప ప్రస్తుతానికి సాధ్యం

కాదు. ట్రాక్టర్లు నిర్మించే కర్మాగారంమాట ఎందుకు, ఒక్క మోటారుఇంజను తయారు చేసే కార్మాగారమే ఇప్పటికి భారతదేశంలో లేదు. పోనీ విదేశాలనుంచి పెద్దపెట్టున యంత్రాలు సరఫరాచేసుకొందామా అంటే, భారతదేశానికి డబ్బులేదు. అదీకాక చిన్నచిన్న పొలాలఖండాలలో ట్రాక్టర్లు వాడేందుకూ సుతరామూ వీలులేదు.

భారతదేశఅధికాహారోత్పత్తి తక్షణ అవసరాలపైదృష్టి పరపినవాళ్లల్లో చాలామంది, యుద్ధకాలంలో ఉత్తరచైనాలో, జపాన్ సైన్యాలు వదలివెళ్లిన విముక్తభాగాలలో అవలంబించిన విధానాలు ఇక్కడా అవలంబించవచ్చునా అని ఉత్సాహంతో ఆలోచిస్తున్నారు. అప్పటి రోజుల్లో అక్కడి కమ్యూనిస్టులకు, కొత్త ఎరువులు, యంత్రాలు, లేకుండానే అధికాహారోత్పత్తి చేయటం ఎల్లాగా అన్న సమస్య తీవ్రంగా ఎదుర్కొంది. అనుభవైక్యంగా, తప్పొప్పులను గ్రహించుకొంటూ, ఒక ప్రణాళికను ఆచరణలోకి పెట్టారు. ఆ ప్రణాళికకు సోవియట్ వ్యవసాయ విధానాలకుగాని, "కమ్యూనిజం"కుగాని ఏమీ సంబంధంలేదు. కాని తత్ఫలితంగా అక్కడ అధికాహారోత్పత్తిసౌకర్యంమాత్రం కల్గింది.

ఈ ప్రణాళికలోని కీలకం – ఈ ఉద్యమానికి ముఖ్యాంగాలు కర్షకులనే తీసికొని వారినే ఉద్యమముఖానికి సంఘటితపరిచి, ప్రణాళికఆచరణ వాళ్లే కొనసాగించుకొనేటట్లు చేయటమే వ్యవసాయవిధానాలు పౌరాణికపద్ధతులలోఉన్న ఇండియా చైనాలాంటి దేశాలలో, ఆహారోత్పత్తికి మూలశక్తి రైతుశరీరకష్టమే. రైతు కృషికి పూనుకొనే ఉత్సాహమే. ఈ ఉత్సాహం రైతులో కల్పించేందుకు, రైతు భూస్వామికి ఇచ్చుకోవలసిన నూటికి 60 వంతుల పంట భాగానికిబదులు 37½ వంతులే కిస్తీగా చెల్లించుకొనేటట్లు నిర్ణయించారు. తత్ఫలితంగా రైతు తనకు తన కుటుంబానికి పుష్టి చేకూర్చుకోగల ఆస్కారం చిక్కింది. ఎక్కువ పండించేందుకై వ్యవసాయపు పనిముట్లకు ఎరువులకు ఖర్చుపెట్టగల అవకాశం చిక్కింది. అదేసమయంలో, రైతులు గ్రామసంఘాలుగా ఏర్పడి, నవీనవిధానాలు ఒకరిదగ్గరనుంచి ఒకరు తెలిసికొగలిగేందుకు, నీటివనరులు, రహదారులు, మొదలైన సౌకర్యాలు సహకారవిధానంలో ఉమ్మడిగా కల్పించుకొనేందుకు ఒకరికొకరు తోడ్పడ్డారు. నియమితధరలకు తమకు మిగిలిన ధాన్యాలను విధాయకంగా ప్రభుత్వానికి ప్రజాస్వామ్యపద్ధతులలో ఏర్పడిన గ్రామధాన్యసేకరణసంఘాలద్వారా అమ్మితీరాలని ప్రభుత్వఉత్తరువుకూడా ఉండనే ఉంది. ఇల్లా రైతులను కేంద్రీకరించి ప్రణాళిక నడుపుకోటంవల్ల, రైతు పుష్టిని కలిగినవాడై, ఎక్కువ పండించటానికి అవకాశం, ఉత్సాహం కలవాడయ్యాడు. భూస్వాములకుకూడా, కిస్తు పంటలోపాలుగా తక్కువైనా, ప్రభుత్వం హామీగా ఆ కిస్తు ఇప్పిస్తుండటంవల్లనూ, పంట ఎక్కువైనందువల్ల, భూస్వామికి గిట్టె సొమ్ము మొత్తం, మునుపటితో దాదాపు సమానంగా ఉండటంవల్లనూ, తృప్తినే కల్గించింది. అయితే వాళ్లకు రావలసిన ధాన్యం ధరలెఖ్ఖను గట్టె సొమ్ము ఇయ్యటంవల్ల ఎక్కువ మిగుల్చుకొని బ్లాక్‌మార్కెట్టులో అమ్ముకొనే అవకాశం లేకుండాపోయిందనే విషయం ముఖ్యంగా గమనించవలసింది.

చైనాలోలాగే, భారతకమ్యూనిస్టులుకూడా భారతదేశంలో ఆహారపుకొరతను అవకాశంగా తీసికొని రైతులలో తమపార్టీకి బలంచేకూర్చేందుకు ఉపయోగించుకొన్నారు. కమ్యూనిజం అరికట్టాలంటే, కమ్యూనిస్టులు అవకాశంగా తీసికోగల పరిస్థితులను లేకుండా చేసికోటమే ఉత్తమమార్గం.

---



ఈ మాసారంభంలో ఢిల్లీలో బర్మాస్వాతంత్ర్యోత్సవాలసందర్భంలో బర్మా రాయబారి పతాకప్రతిష్ఠ జరిపిన దృశ్యం.



పెద్దకథ :

# అడవికాచిన వెన్నెల

(గతసంచిక తరువాయి)

శ్రీ 'బుచ్చిబాబు'

తెల్లవారింది. ఆ చంద్రుడే సూర్యుడైనట్లు, మెత్తటి కాంతి ఆకులమధ్యనుంచి, నా శాలువలో దూరింది. ఉలిక్కిపడి లేచాను. చంద్రుడు కాడు, సూర్యుడే ప్రకాశిస్తున్నాడు. కాలకృత్యాలు దీర్చుకుని రొట్టెలు, టీ తీసుకున్నాం. స్నానాలు చేసేటప్పటికి తొమ్మిదైంది. వాళ్లందరూ ఆఫీసుపని చూసుకుంటాం అన్నారు. నేనూ, గురవయ్యా, అల్లా బైలుదేరాము. రెండు మైళ్ళదాకా నడిచి వెళ్ళాం. మాకు వొక్క అడవిమృగం కూడా కనబళ్ళేదు. గురవయ్యా, ఆచుట్టుపక్కల ముసిలిపులి చేస్తున్న దురంతాలు వర్ణించాడు. మేం. తిరిగి వొచ్చేటప్పటికి పన్నెండు కావచ్చింది. అప్పటికి ప్రేమానందం వెళ్లిపొయ్యాడు. భోజనాలు చేసి, మళ్లా కబుర్లు మొదలెట్టారు.

"మీరంతా వొకచోట కూర్చుని కాగితాలపని చేసుకోడం అయితే, యీ కాంప్ చెయ్యడం ఎందుకు ?" అని అడిగాను.

రెడ్డి సమాధానం యిచ్చాడు.

"రంగనాథన్ అని మరొక పెద్ద ఆఫీసరు కూడా రావాలి. ఈ వుదయం వొచ్చి, కాంప్ చేశాడుట—యిక్కడికి ఎనిమిది మైళ్ళల్లో మరో బంగళా వుందిలే. ఆయనా, మేమూ కలిసి, రేపో, మాపో పర్యటనం సాగిస్తాం. ఆయన్నికలుసుగోడానికి ప్రేమానందం సాయంత్రం వెడతాడుట."

"చూడండి—ఈరెండు రోజులూ మేం చెప్పినవన్నీ విన్నారు. ఆలోచించారు. నిర్మలవిషయం ఏమన్నా తేలిందా ?" అని అడిగాడు రాఘవులు.

"ఆఁ" అన్నాను.

అతను ఆశ్చర్యం ప్రకటించాడు. శ్రీహరి నాదగ్గరగా జరిగాడు. ఆఖరికి రెడ్డికూడా, లేచి కూర్చుని, నాకేసి ప్రశ్నార్థకంగా చూశాడు.

"చెప్పాలి." అన్నారు ముగ్గురూ.

"రాత్రంతా ఆలోచించాను. ఒక రకమైన కథ ఊహలో రచించుకున్నాను. కాని ఋజువు చెయ్యమంటే చెయ్యలేను." అన్నాను.

"మాకు ఋజువులు, ప్రమాణాలు, అక్కర్లేదు. చెప్పండి—ఒరే, గురవా, రెండు చుట్టలు కట్టి, టీ పెట్టరా." అని కేకేశాడు రాఘవులు.

"చెప్తాను వినండి. నాకథ మొదట్లోనే ప్రారంభమైంది. నిర్మలని ప్రేమానందానికివ్వడం స్థిరపడింది. తాంబూలా లుచ్చుకున్నారు. ఇది జరిగింతర్వాత—ఎప్పుడో చెప్పలేను—ఆమె జీవితంలోకి మరొకవ్యక్తి ప్రవేశించాడు—అతన్ని 'ఎక్స్' అని వ్యవహరిద్దాం—నిర్మల అతన్ని చూడ్డం, ప్రేమించటం వొకసారి జరిగింది. నిర్మలవి తీవ్రమైన వుద్రేకాలు. ప్రేమించినా, ద్వేషించినా, క్రమం, పద్ధతి, కారణం, ఔచిత్యం, సహజం, న్యాయం—యివేవీ పాటించదు. ఆమెకి 'ఎక్స్' పరిచయం కలిగింది. మాటలు జరిగాయి. కాని తలితండ్రులకి, పెండ్లికి మాటిచ్చేసింది. ఏం చెయ్యడం? . ఆపెండ్లి వద్దంటే, ఏదో కుతంత్రం జరుగుతోందని నలుగురూ పసికడతారు. తన శీలాన్ని శంకిస్తారు...మరీ ఘోషాలో వుంచేస్తారు. తను స్వేచ్ఛ పోగొట్టుకుంటుంది. 'పెండ్లివల్ల మన ప్రేమకి అంతరాయం ఎందుకుండాలి ? అంతరాయంవల్ల మనప్రేమ మరింత పదునెక్కుతుంది' అన్నాడు 'ఎక్స్'. ఇంకేం కావాలి ?

ప్రేమానందాన్ని పెండ్లాడింది. నాలుగు నెల్లలో కార్యం అన్నారు. ఏం చెయ్యాలి? ఎక్స్‌ని కలుసుకుని చెప్పింది. ఎక్స్ బాధపడ్డాడు. అతను చిన్నవాడు. ఉద్యోగం లేదు. ఎవర్నీ సలహా అడిగే వ్యవహారం కాదు. 'ఇంతేనా మనప్రేమ' అన్నాడు.

నిర్మల వాగ్దానం చేసింది. చేతిలో చెయ్యేసింది. భర్తను తాకనివ్వనంది. సరా? ఎట్లా సాధ్యం అని అడిగాడు. నీకెందుకు, నేను చూస్తాగా, నన్ను నమ్ము, అంది నిర్మల. ఎక్స్, అతని హృదయాన్ని ఉత్తరంద్వారా బైటపెట్టి, ఆమె కందిచ్చాడు. సంతోషంతో నిర్మల సమాధానం పంపింది.

కార్యంరాత్రొచ్చింది. నా ఆరోగ్యం బాగాలేదంది. కొంతకాలంవరకూ ఆమెని విడిచిపెట్టమని, ప్రేమానందాన్ని బ్రతిమలాడింది. అతనికి కోపం వొచ్చింది. చదువుకున్నవాడు - బలాత్కరించగలడా? జబ్బంటోంది. ఏదన్నా జరిగితే, నలుగురూ అతనికి గడ్డెడతారు. ఏవో సణిగాడు. నిర్మల లాలించింది; మాటలతో మంచిచేసుకుంది. పెద్దలందరికోసం కార్యం. ఎవళ్లకీ తెలీనక్కర్లేదు—తృప్తిపరిచింది. పక్కకితిరిగి ముసుగెట్టుకుని పడుకున్నాడు.

“మందిప్పించడం లేదా మీ వాళ్లు?” అనుంటాడు రెండో రాత్రి.

“మావాళ్లు కార్యం వొద్దన్నారు. మీ వాళ్లు నిర్బంధపెడితేనేగా యీ తంతు ఏర్పాటుచేశారు?” అనుంటుంది.

అల్లాగే మూడు రాత్రుళ్లూ గడిచిపోయ్యాయి. భర్త వెళ్లిపోయ్యాడు. నిర్మల ఎక్స్‌తో వుత్తరప్రత్యుత్తరాలు జరుపుతోంది. ఒక వుత్తరంలో ‘ఎక్స్’ అసూయ ప్రకటించాడు. ఆడదాన్ని నమ్మకూడదన్నాడు. ‘తను హాయిగా భర్తతో గడుపుతోంది—అతనుపడే విరహం ఆమెకేం తెలుసు?’ అనుంటాడు. శెలవల్లో భర్త వొచ్చాడు. జబ్బు—వీల్లేదండి—అతనికే జబ్బు కనబళ్లేదు. విసుక్కున్నాడు. ‘ఏం కథ?’ అన్నట్లుగా, అస్పష్టమైన ఆరోపణలు సాగించాడు. ఎట్లాగనుకున్నా ఫరవాలేదంది. భర్త వెళ్లిపోయాడు.

ఎక్స్‌ని కలుసుకుని, జరిగిందంతా చెప్పింది, నిర్మల. వారిద్దరూ, వొక్క రాత్రేనా గడిపే అవకాశంలేదు. ఏం చెయ్యటం? నీకెందుకు, నీకు హాయిగా భర్తున్నాడు. ఏదో తమాషాకి ప్రేమిస్తున్నావనీ, నన్ను ఏడిపిస్తున్నావనీ అన్నాడు. మళ్లా ప్రమాణాలు, వొట్లు. నువ్వు తల్చుకుంటే మనం కలుసుగోలేమా! అన్నాడు. ఏం చేస్తుంది. అతనికి నమ్మకం కలగడం ఎట్లా? తెగించింది. నిర్ధారణ కొచ్చింది. నాన్న కాంప్ కెళ్లాడు.

అమ్మ పడుకునుంటుంది. మధ్యాహ్నం. ఏం? ఏర్పాటుచేసిరమ్మంది. అతను వెళ్లాడు. అంతా అనుకున్నట్లె జరిగింది. గదిలో ఏకాంతంగా కూర్చుని గుసగుసలు సాగించారు. ఏం జరిగిందో, ఎంతవరకూ జరిగిందో వూహించలేం—ఏం జరిగినా, అట్టేసేపు జరగలేదు. పోస్టుమన్ పిలిచాడు. లేచివెళ్లింది. భర్తదగ్గరనుంచి కవరు. ఆమెకి ఎవరో వున్నారనీ, ఆ విషయం తను తెలుసుకున్నాడనీ, అంచేత ఆమెని వొదిలెయ్యడం తప్ప గత్యంతరంలేదనీ, భర్త వ్రాశాడు. నిర్మల దిగులుపడింది; భయపడింది. గదిలో కెళ్లి, తలుపు జేర్లవేసింది. రెండు క్షణాలలో ఎవరో తలుపు తోశారు. ఎవరంది? ‘నేనే, పేపరొచ్చిందేమో, చూద్దామని—పోస్టుమన్ వొచ్చాడుగా’ అన్నాడు మనోరమబావగారు. అవును, పోస్టుమన్ పేపర్ కూడా తెచ్చాడు. హాల్లో బల్లమీద పెట్టాను, తీసుకోమంది. ఇంతలో చెల్లెలు లేచినట్లు, వంటింట్లో చప్పుడైంది. హాల్లో కెళ్లి, వంటింటితలుపు జార్లేసి, సందు గదిలోంచి, ఎక్స్‌ని బైటకి పంపించివేసింది. అతను వెళ్లగానే నిర్మల భయపడింది. మనోరమబావగారు, వారిద్దర్నీ చూశాడేమో—భర్త వుత్తరం వొకటి—వొదిలేస్తానని బెదిరించాడు. ఏం చెయ్యడం? మతిపోయి, నూతులో కురికింది.

ఇంక రెండో యత్నం.

మధ్యలో శ్రీహరి ఆపుచేశాడు.

“ఆగండి. ఆరోజుమధ్యాహ్నం రెండింటికి నే వెళ్లాను. ఆ సమయంలో ‘ఎక్స్’ ఇంట్లోనే వున్నాడంటారా? నేను నమ్మలేను. నేను రేడియో విన్నాను; పేపర్ చదివాను. తర్వాత, నిర్మల మనోరమబావగార్ని లేపి కాఫీ యిచ్చింది. నేను వెళ్లిపొయ్యాను. నా వెనకాలే అతనూ వొచ్చాడు” అన్నాడు శ్రీహరి.

“ఆ తలుపుతట్టి, పేపర్ అడిగింది మీరే కావొచ్చు. నిర్మల, అడిగినవారు మనోరమ బావగారనుకునివుండొచ్చు. తీరా తను ముందు గదిలో కెళ్లినప్పుడు, అతను నిద్ర నటించకూడదూ? అతను కాఫీ తాగి వెళ్లిపోయినసంగతి ఆమెకేం తెలుసు?

“సరే—రెండో యత్నం పూర్తిచెయ్యి” అన్నాడు చంద్రారెడ్డి.

“నిర్మల అత్తవారింటికెళ్లింది. అక్కడ బాగానే వుంది. అత్తగారి కోడరికం లేదు; తోటికోడలు సరదా అయిన మనిషి; భర్తా, తనూ వున్నా, ఆ రోజుల్లోకూడా ఆంతరంగికంగా కలుసుగోలేదని నా నమ్మకం.

భర్త ఆమెని విశ్వసించేటట్లు చేసుకుంది మాటలల్ల. ఉద్యోగంలో కెళ్లిపొయ్యాడు. ‘ఎక్స్’ ఆ వూళ్లో వున్నాడు. తరుచు కలుస్తుండేవాడు; కలుసుగున్నప్పుడు, ఉత్తరాలు వ్రాసి, అంది పుచ్చుగోటం జరిగేది. ఉత్తరాలలో వారి ప్రేమనంతా వెళ్ళబుచ్చుగుని తృప్తిపడేవారు. ఆనాడు, ఉదయమో, మధ్యాహ్నమో, ‘ఎక్స్’ ఆమెకి వొవుత్తరం యిచ్చాడు. మధ్యాహ్నం, నిశ్శబ్దంగా వుంది—తనూ గదిలో కెళ్ళి పడుకుని, ఆవుత్తరం చదువుకుంది. గదితలుపులు మూసి, ఆవుత్తరానికి ప్రత్యుత్తరం వ్రాసింది. వ్రాస్తుంటే ఆగదిలోకి మరిది—కోటేశ్వరరావు—గభాలున వొచ్చి, ‘ఏమిటని’ అడిగాడు. ఆమె వులిక్కిపడి, ఉత్తరం దాచేసింది. అతను వెళ్ళిపొయ్యాడు. ఆవుత్తరం,తన ట్రంక్ పెట్టెలో దాచేసి, వంటింట్లో కెళ్లి పని చూసుకుంటోంది. రెండున్నర దాటింది. కొంటె మరిది, తాళాలు ఎల్లాగో వెల్లగించి, ట్రంకు తెరిచి, ఆమె వ్రాసిన వుత్తరం, సంగ్రహించాడు. నిర్మల చప్పుడు విని పని కట్టి, గదిలో కొచ్చి చూసుకుంది. ఉత్తరం లేదు. కొంప మునిగిందనుకుంది. మరిదికోసం యిల్లంతా వెదికింది. ఎక్కడా లేడు. ఏం చెయ్యడం? మరిది అసాధ్యుడు. ఆవుత్తరం, అన్నగారికి చూపిస్తాడు. తనకి తలవొంపు, పరిత్యాగం, నింద తప్పదు. తాత్కాలికపౌరుషం, వుద్రేకం, ఆమెని వొక నిర్ణయానికి తీసుకొచ్చాయి. గబగబ దొడ్లోకెళ్ళి, నూతులో పడింది.

నిర్మల యింకెన్నడూ ఆత్మహత్య తలపెట్టదు.” అని, నా గాథ ముగించాను.

మొదట మాట్లాడింది రెడ్డి.

“నాకంతా బాగానే కనపడుతోంది. కాని వొకటి నచ్చలేదు. ‘ఎక్స్’ని కలవడం కోసం, భర్తని దూరంగా వుంచడం, వాగ్దానాలు—అవన్నీ అసహజంగా కనబడుతున్నాయి. నాచిన్నప్పుడు, మా అమ్మమ్మ రాజకుమార్తెలనుగురించి చెప్పే కథ మాదిరిగా వుంది.”

గురవయ్య టీ తెచ్చాడు. అందరం మాట్లాడకుండా త్రాగాం. తరవాత వ్యాఖ్యానం రాఘవులు చేశాడు.

"మీరు చెప్పిన గాథలో, నిర్మల భర్తతో కూడక, ఎక్స్‌ముందు పాతివ్రత్యం ప్రకటించడం తప్ప—యింకేమీ హర్షించదగ్గ వివరాలు లేవు. మామూలుగా మనం పత్రికలలో చదివే, వ్యభిచారుల గాథలా వుంది. నిర్మల అందమైంది కావొచ్చు. ఆమె చర్యలో కవిత్వంగాని, కళానుగుణ్యమైన సౌందర్యంగాని గోచరించలేదు."

"అందమైన స్త్రీశరీరాలకు అందమైన, ఆత్మలను కల్పించడం, పురుషుడి దౌర్బల్యానికి చిహ్నం" అన్నాను నేను.

అందరిలోకీ ఎక్కువ ఆశ్చర్యం ప్రకటించింది శ్రీహరి.

"అయితే, హంతకు డెవరండీ?" అనడిగాడతను.

"అది మీరు నిర్ణయించాలి." అన్నాను.

"నేననా మీ వ్యూహ!"

"నే నల్లా గనలేదు. డిటెక్టివ్ నవలా కారుడు కథ చెప్తాడు; హంతకుణ్ణి పాఠకుడే పట్టుకోవడంలోనే వుంది, ఆనవల్స్‌లోని మజా." అన్నా.

"నన్ను నిర్మల ప్రేమించటం సంభవమా?" అని అడిగాడు శ్రీహరి.

"స్త్రీలు ఎవర్ని ప్రేమించరో, ఎందుకు ప్రేమిస్తారో, ఎందుకు ప్రేమించరో, సృష్టించిన బ్రహ్మదేవుడు కూడా, నిర్ణయించలేడు." అన్నాను కచ్చితంగా.

ఇంతలో పెట్టిబండి వొచ్చింది. పత్రికలు, టపా చూసుకున్నారు. చంద్రారెడ్డి, ఆఫీసుకవర్లు చింపి చదివాడు.

"నాకేమన్నా వుత్తరా లున్నయ్యా?" అంటూ ముగ్గురూ ఎగడ్డారు.

"ఉంది. మధుసూదనానికి, ట్రాన్స్‌ఫర్ ఆర్డరొచ్చింది." అన్నాడురెడ్డి. ఆర్డర్ చేతికిచ్చాడు. అవును. మధుసూదనాన్ని, ఉత్తరజిల్లాలకి—పర్లాకిమిడికేసి—బదిలీ చేశారు. అతని స్థానంలో 'ఉన్నిధన్' అనే మళయాళీని వేశారు. తక్షణం, ఛార్జియిచ్చి, కొత్తచోటులో ప్రవేశించాలని వుత్తరువైంది.

"ఇదేమిటి, యిక్కడి కొచ్చి, నెలేనా కాలేదు—పోదురూ, గవర్నమెంటు సర్వీసు యిల్లాగే ఏడుస్తుంది. అర్థం పర్థం లేదు. బదిలీలకి—"అని రాఘవులు, శ్రీహరి, విసుక్కుని, మధుని, బుజ్జగించి, సానుభూతి ప్రకటించడం సాగించారు. సంభాషణంతా, బదిలీని గురించి. ఆ గొడవలో హంతకు డెవరో తెలుసుకోవాలన్న, బాధ్యత నాకు తప్పింది. ఆవిషయం ఎవరూ ఎత్తలేదు.

మధుసూదనం, ఛార్జి వొప్పగించేటప్పటికి మూడు దాటింది. మళ్లా మేం మొహాలు కడుక్కుని, మంచిదుస్తులు వేసుకుని, మధుసూదనాన్ని యింటిదాకా సాగనంపడానికి ప్రయాణమయ్యాం. మధు 'తలనొప్పిగా వుంది, కాసేపు యింటికెళ్లి విశ్రమిస్తా' నన్నాడు. మర్నాడే అతను సామాన్లూ అవి సర్దుకుని వెళ్లడానికి నిశ్చయించుకున్నాడు. కొత్త స్థలంలో చేరేటందుకు, యింకా ఆరు రోజులు వ్యవధుంది. ఈలోగా, యింటికెళ్లి, నలుగుర్నీ చూసి, డబ్బాగట్రా తీసుకుని వెడతాడుట. అతన్ని ఇంట్లో దిగవిడిచేటప్పటికి నాలుగు దాటింది. ఆ ట్రాన్స్‌ఫర్‌తో వాతావరణంలో దిలాసా తగ్గింది. నాకూ మొర్నాడు బైలుదేరివెడదామా అనిపిస్తోంది. ప్రేమానందాన్ని, వేటవిషయం అడిగి, తొందర్లో ఏర్పాటుచెయ్యించమని కోరడం మంచిదనుకున్నాను. మా రెడ్డి సలహా అడిగాను.

"రామనాథాన్ని చూసి, ఆయన సాయంత్రానికి వొచ్చేస్తాడు. కావాలంటే సాయంత్రం అడుగుదువుగాని" అన్నాడు రెడ్డి. అల్లా కొండదాటి, చెలువుదాటి, లోయలో నడుస్తూవొస్తున్నాం. ఇంతలో వోముసలాయన, వొగర్చుకుంటూ మా దగ్గర కొచ్చాడు.

"ఈ ప్రొద్దుటే పులి, బఱ్ఱె పోతుని పొట్టనెట్టుకుందండీ, స్వాములోరూ!" అన్నాడు. వివరా లడిగాడు రెడ్డి.

"కట్టెలు కొట్టడానికి పోయుండాం, మా ఆడోళ్లు, నేనూ. మేకల కుర్రాడు, మస్తాన్ గాడు మాతో వుండాడు. బర్రెలని ఆడే తోలుతుండాడు. పొదలఎనక్కి బర్రెపోతు ఎళ్లిందంట. ఆడు వెదుకుతుండంగా, పొదల్లో సప్పుడైంది. మస్తాన్, లగెత్తుకొచ్చాడు. మేం గొడ్డళ్లూ అవీ తీసుకుని పరుగులెత్తాం. బర్రె పోయింది. పులిజాడే లేదండి, యిసిత్రం—అడుగులు గుర్తులుండైలెండి—"

"ఎంత దూరంలో?"

"అడివిఖొంగలోనేనండీ—రెండుకోసులు దూరం."

అప్పటికి సూర్యుడస్తమిస్తున్నాడు. ఈ వార్తపురస్కరించుకుని, ఆ రాత్రే వేట ఏర్పాటుచెయ్యమని, ప్రేమానందాన్ని అడుగుదామని, అతని బంగళాకి వెళ్లాం. పని చేసేవాళ్లపిల్లలు ఆడుకుంటున్నారు. ఇంకా అయ్యగారు యింటికి రాలేదన్నారు.

"పోనీ, వొవుత్తరం రాసిచ్చి, పోదాం" అన్నాను. రెడ్డి, సరేనన్నాడు.

"ఒరే, కుర్రాడా, అమ్మగార్ని పిలుస్తావా?"

"ఓ, సెలువుకా డుండారు"అని వాడు వెళ్లాడు. పదినిమిషాల్లో, నిర్మల చక్కా వొచ్చింది. నన్ను చూసి, మందహాసం చేసింది.

"ఇంకా రాలేదు." అంది. నిర్మలకంఠం అదే మొదటిసారి వినడం నేను. కంఠం వినకపోయినా బాగుండునే అనిపించింది. అందులో మార్దవంలేదు, మాధుర్యం లేదు. కోకిల కంఠంకాదు. వోవిధంగా, నెమిలి కంఠంలా వినిపించింది. అందులో కొంత బొంగురుతనం, మసీదులో డోలువాయిస్తే మారుమ్రోతలాగా—జీర, వున్నాయి. సౌందర్యానికి వోర్వలేక, సరస్వతి, ప్రాధేయపడి, ఆ కంఠాన్ని పాడుచెయ్యమని కోరినటు—లేక ఆతృతతో, కొత్తదనంతో, సిగ్గుతో, పగిలిన కంఠమా? కుర్రాడికి సంజ్ఞ చేసి, కుర్చీలు, బల్ల, బైట వేయించింది.

నల్లరంగు, పల్చటి చీర నిండుగా కప్పుకుంది. చేతికి రెండేగాజులు—వొకటి బంగారంది, రెండోది, ఎఱ్ఱ ప్లాస్టిక్‌ది; విషాదంతో వొణికే పెదవులు. తీవ్రంగా లోకాన్ని శాసించే నాసాపుటాలు. కామాన్ని జుట్టుముంగురుల్లో మెలితిప్పి బంధించినట్లు కనబడని పాపిడ. నే నెన్నడూ మరిచిపోని, ఇంద్రజాలంతో తళుక్కుమనే ఆమె నేత్రాలు—అన్నీ సంధ్యలో అసహజంగా, స్వప్నంలోలాగా, మాయగా కనిపించాయి.

"వొస్తుంటారు. కూర్చోండి, టీపెడతాను." అంది.

"అప్పుడే రెండుసార్లైంది. శ్రమపడకండి." అన్నాను.

నిర్మలకళ్లలో నవ్వు, చెక్కిళ్లమీదికి జారింది. ఈఅల్పమైన శరీరంలో, యీ లేత జీవిలో, యింత శక్తి, యింత బలం, యింత తృష్ణ, అడివిని దహించేసే, ప్రేమజ్వాలా!

"కాగితం, కలం, యిప్పిస్తారా?" అన్నాడు రెడ్డి, ఆవిడ యింట్లోంచి, లెటర్‌పాడ్, పెన్, తీసుకొచ్చి, బల్లమీద పెట్టి, లోపల గుమ్మంలో కెళ్లి నిలబడింది.

'మీకిక్కడ వొక్కరికీ భయంగా వుండదూ?' అని లోపల ప్రశ్ని నిర్మాణం చేసుగున్నా కాని బైటకి అడగలేక పొయ్యాను. ఉత్తరం వ్రాశాను?

"అయ్యా,

ఈవుదయం, పులి అడివి మొగలో బర్రెను చంపి తీసుకుపోవడం చూసినవాళ్లు నాతో చెప్పారు. ఈ రాత్రి, అది మన అడవిలోనే వుండొచ్చు, అంచేత, యీ వుత్తరం చూసుకున్న తక్షణం, మీరు, వేటసన్నాహం చేస్తారని ఆశిస్తున్నాను. మధుసూదనానికి, ట్రాన్స్ఫరైంది. తన వొంట్లోకూడా బాగా లేదన్నాడు; చార్జీ యిచ్చేశాడు. రేపే ప్రయాణం అవుతాడుట. అంచేత సర్దుకొని, రెస్టుతీసుకుంటాడు. కాబట్టి, యీరాత్రి, వేటకి చంద్రారెడ్డి, నేను, రాఘవులు, శ్రీహరి, సిద్ధంగా వుంటాము. మిగతఏర్పాట్లన్నీ రెడ్డి స్వయంగా చేస్తానని హామీ యిచ్చాడు. నేను కూడా, వేట ముగిస్తే, రేపో, మాపో వెడదామనుకుంటున్నాను. ఈ వుత్తరానికి అన్యథా ఎంచరనుకుంటాను."

ఉత్తరం మడిచి, కలం మూసి బల్లమీద పెట్టాను. సూర్యుడు అస్తమించినట్లు, పడమటి ఆకాశంలో మేఘాలు శాణసంచా కాలుస్తున్నాయి. పవిత్రమైన రక్తంతో సంధ్యాదేవి బొట్టు పెట్టుకుంది. ఆకాశంలో పూర్ణచంద్రుడు కన్ను తెరిచాడు. ఎఱ్ఱటి మేఘాలు చంద్రుడిమీదికి పాకి, బంగారు తీగెలతో అలంకరించాయి. అడివిచీకట్లు మా చుట్టూ అలుముకుని, నిర్మలచీరసలుపులో కేంద్రీకరిస్తున్నాయి. ఆ చీకటిని ఛేదించగల నిర్మలనేత్రాల మెరుపు తళుక్కుమనడం మిగిలింది.

ఉత్తరం, ఆమె కిచ్చాను.

"రాగానే వారి కివ్వండి."

తల పంకించింది—అడివిని ట్టూర్చిన తీక్ష్ణంల —

"మీరూ చూడొచ్చు."

అని నేనూ, రెడ్డీ వెనక్కి మళ్లి నడవడం సాగించాం. పదిగజాలు వెళ్లాక వెనక్కి తిరిగాను; రెడ్డి నా మెడని ముందుకి తిప్పాడు. కాంప్ దగ్గరికి వొచ్చేశాం.

భోజనాలు చేసి వెన్నెట్లో కబుర్లు చెప్పుగుంటూ కూర్చున్నాం. ప్రేమానందం గుర్రంమీద చక్కావొచ్చాడు. గురవయ్య, మరో నాలుగు గుర్రాలు సిద్ధం చేశాడు. రెండు పెట్రొమాక్స్ లైట్లు, తీసుకొని, అరడజనుమంది, కూలీలు, తుపాకులు, బల్లాలు, వల, తీసుకొని, రెండు మేకపోతుల్ని తోలుకుంటూ నడిచారు.

ఫ్లాస్కుల్లో టీ పోసుగుని, బిస్కట్లు, డబ్బారసుకులు, పిస్టల్సు తీసుకొని మేం, గుర్రాలమీదికెక్కేటప్పటికి, పదకొండైంది గురవయ్య, ప్రేమానందం, శ్రీహరి, బాగా ఆరితేరిన రౌతులు—అంచేత ఆముగ్గురూ ముందుగా వెడుతున్నారు. నేను, రాఘవులు, రెడ్డి కబుర్లు చెప్పుగుంటూ వెనక మెల్లిగా 'ట్రాట్' లో వెడుతున్నాం. అరగంటలో అడివి ప్రవేశించాం. గియ్యమని భయంక



రంగా కీటకాల రొద; వెన్నెలని చొరనివ్వని దట్టంగా అల్లుకున్న అడివి—ఆకుల మధ్యనుంచి పరీక్షగా చూస్తే, చంద్రుడి క్రీగంటిచూపులు అగుపడ్తాయి. క్షణ క్షణం, ఏదో మృగాన్ని ఎదుర్కొన్నట్లు భ్రమ—తీరా ఏమీ వుండదు. ఆ అనుభవం, భయంగా, చిత్రంగా వుంటుంది. ఎన్నడూ రాని, తెగింపుకూడా వొచ్చింది నాకు. ప్రేమానందం, చెట్లమధ్య నిలిచిపొయ్యాడు.

అందరం గుర్రాలు దిగి, ముందుగా వొచ్చిన, అరడజనుబంట్రోతుల్ని, దీపాలతో అక్కడ వొదిలేశాం. మిగతవాళ్లం, మేకపోతుల్ని తోలుకుంటూ ఫర్లాంగు నడిచాం. ఒకచెట్టుకి, గురవయ్య మేకపోతుని కట్టేశాడు. అరఫర్లాంగుదూరంలో, ప్రేమానందం, రెండో పోతుని మరో చెట్టుకి కట్టేసి తను, ఇరవై గజాలదూరంలో పెద్దచెట్టు మొగలోకి ఎక్కి కూర్చున్నాడు.

నాకు చెట్లపై కూర్చోడం చేతకాదు. నాకోసం, రెడ్డి వలతో చెట్టుకొమ్మలమధ్య వుయ్యాల అమర్చాడు. అందులో నేను, రెడ్డి, కూర్చున్నాం. గురవయ్య, రాఘవులు, శ్రీహరి, మొదటిపోతువద్దగ చెట్టుమీది కెక్కారు. గుసగుసలుతప్ప ఓగ్గరగా మాట్లాడ్డం వల్లకాదన్నారు. నాకూ పిస్టల్ యిచ్చారు. సమయం వొస్తే, దాన్ని వుపయోగించగలనన్న ధైర్యం నాకు లేదు. దాని వునికి, నాతోటివారికేనా వుపయోగపడుతుందన్న ధీమావల్ల, నేను నిర్భయంగా వున్నా, లోపల బెదురుగా నేవుంది. కాని, పులి—అందులో, అది ముసిలిపులిట—

యింతఎత్తు చెట్టుమీదికి ఏం ఎగురుతుంది? పులిభయం వొక్కటే కాదు. నన్ను పట్టుకున్నది. కొమ్మలమీద పాములుంటే! చప్పుడైనప్పుడల్లా వూపిరి బిగపెడుతూ అల్లాగే గంట కూర్చున్నాం. ఏమీ జరగలేదు.

అడివి కాచిన వెన్నెలకేసి చూశాను. వెన్నెలఅందం, ఆనాడు చూసినట్లుగా నేనెప్పుడూ చూళ్లేదు. ఎన్నడూ రాని ప్రియుడికోసం వేచివుండిన కన్యకలోని మనోనిశ్చలత్వం, ఆ వెన్నెట్లో వుంది. కాలం గడవదు. ఆవలింతలొస్తున్నాయికాని నిద్రరాదు. గుండెలు కొట్టుకుంటున్నాయి. కాని జీవంలేదు. గడియారంకేసి చూశాను అడివికి హడిలిపోయి తిరగడం మానేసిందేమోనని! మానలేదు. వొంటిగంటైంది.

ప్రేమానందాన్ని గురించి ఆలోచించాను. అతను చాలా ధైర్యవంతుడులా తోచాడు. ఏం ధైర్యంవుండి ఏం ప్రయోజనం! భార్యముందు పిరికిపంద—అతనికి కావల్సినదాన్ని సాధించే శక్తి అతనికి లేదు. అతనికి ఏ ముహూర్తాన నామకరణం చేశారో పెద్దలు, అతని జీవితంలో, ప్రేమా లేదు, ఆనందం లేదు. అతని స్థానంలో నే వున్నట్లు వూహించుకుని బాధపడ్డాను. ఆ పరిస్థితుల్లో, ఎవరుమాత్రం ఏంచెయ్యగలరు! భార్యని శంకించగలడు, కాని ఋజువు చెయ్యలేడు; భార్యని ద్వేషిస్తాడు, కాని ప్రేమని వొదులుకోలేడు; ఆమెని కలవలేడు. కాని, ఆమెని విడిచిపెట్టనూ లేడు.

పులిగర్జన వినపడింది. ఉలిక్కిపడి, కాళ్లు రెండూ పైకి లాక్కుని ముడుచుకున్నాను. రెడ్డి చెప్పాడు—అది పులిగర్జన కాదుట—గురవయ్య, పులిమాదిరి అరవడం నేర్చుకున్నాడుట. ఆ అరుపు విని, నిజంపులి అక్కడికి రావడం జరగొచ్చుట.

పులి వొచ్చినా, ఏ దిక్కునుంచి వొస్తుందో ఎవరికి తెలుసు? నేను చూడకుండానే, అది రావడం, వెళ్లడం జరుగుతుందేమో ననిపించింది. అన్నిదిక్కులా పరకాయించి చూశాను. నాకేమీ కనిపించలేదు.

బిస్కట్లు తిన్నాం; రెడ్డి టీ పోశాడు త్రాగాం. మరో సిగరెట్టు ముట్టించాను. వో అరగంట గడిచింది. మరో సిగరెట్టు ముట్టించాను. గురవయ్య మళ్లా గర్జించాడు. రెండు మూడు నిమిషాల్లో, తుపాకీ మ్రోగింది. నేను కొమ్మని గట్టిగా పట్టుకుని కళ్లు మూసుకున్నాను. మరోచోట దగ్గరలో, తుపాకీ మ్రోగింది—కళ్లు తెరిచాను-దూరంగా వెళ్లిపోతోంది పులి, మేకపోతుని వీపుమీద లాక్కుని, వెనకభాగంమాత్రం నాకు కనబడింది. మరోసారి తుపాకీ మోగించి, చెట్టుమీదనుంచి ప్రేమానందం దుమికి, పొదవైపు పరుగెట్టాడు. రెడ్డికూడా దూకాడు. అందరూ దిగారు; నన్నూ దించారు. పదినిమిషాల్లో ప్రేమానందం తిరిగివొచ్చాడు.

"పోతుని చంపి, వొదిలేసిపోయింది—మన దెబ్బలు సరైన చోట్ల తగల్లేదు. కుంటుతోపోయింది" అన్నాడు.

"దెబ్బలుతిన్న పులి చాలా ప్రమాదం, ఈ రాత్రికి వెనక్కిపోదాం—" అన్నాడు రెడ్డి. ఆ అనుభవం చాలన్నా, నేకూడా. అపూర్వమైన అనుభవాన్ని, కలగజేసినందుకు ప్రేమానందాన్ని 'థ్యాంక్' చేశాను. అంతటితో వేట ముగించి, వెనక్కి మళ్లాం. కాంప్‌లోకి చేరుకునేప్పటికి తెల్లారి నాలుగైంది.

తేయాకు లేకపోయింది. కాసిని వేడి పాలు తాగి పడుకున్నాం. తీవ్రంగా నిద్ర పట్టేసింది. తొమ్మిదైందో, పదైందో గుర్తులేదు; ఎవరో లేపిన ట్లనిపించింది. మిగతా అందరూ లేచి పనులు చేసుకుంటున్నారు. వెడుతున్నానని చెప్పడానికొచ్చాడు మధుసూదనం. లేచి కళ్లు తుడుచుకున్నాను.

"అప్పుడే?" అన్నాను.

"ఈసారి వకేషన్‌కి మా వూరు రండి. పర్లాకిమిడిలో ప్రసిద్ధమైన అడివీ, మృగాలూ వున్నాయి."

"అల్లాగే."

"మీ రింకా రెండు రోజు లుండండి—మావాళ్లందరితోనూ—నేకూడా వుండేనా—వాళ్లందరికీ చిన్నబోయిన ట్లుంటుంది" అన్నాడతను.

"నాకు వీలుపడదు. చూడవల్సిన వింత కూడా చూశాను. నేనూ సాయంత్రం వెడదామనుకుంటున్నా."

మధుసూదనం వెళ్లిపొయ్యాడు.

"ఎప్పుడైనా వుత్తరం వ్రాస్తూండు—మీ అనుభవాలు చదువుకునైనా తృప్తిపడతాను" అన్నాను. అతను నవ్వుతూ వెళ్లాడు.

నేనింకా వొకటి రెండు రోజు లుందామనుకున్నా, నన్ను గట్టిగా చంద్రారెడ్డి వుండమనలేదు. సర్వేకి రైలుదేరమని వాళ్ల ఆఫీసర్ రామనాధయ్యర్ ఆరోజే ప్రయాణం కట్టాడుట. వాళ్లు టూర్ చేస్తుంటే, నాకేం కాలక్షేపం గాదని, అందరిదగ్గరా శెలవుతీసుకుని, ఆ మధ్యాహ్నం మూడింటికే నేనూ ప్రయాణమయ్యాను. రెడ్డి పెట్టెబండి తెప్పించాడు బెడ్డింగ్ అందులో పడేసి కూర్చున్నాం. బండి కదిలింది. ప్రేమానందంతో మరోసారి చెప్పి గుడ్‌బై కొట్టడం మంచిదేమో అన్నాను, రెడ్డితో.

"నీ కింకా చిన్నతనం పోలేదురా—నిర్మలని చూడాలని—అవునా?" అన్నాడు రెడ్డి, నవ్వుతూ. నేనూ నవ్వేశాను.

"రైలు కింకా అరగంటే టైముంది. ఆలస్యం చేశావంటే, తెల్లారేదాకా, ప్లాట్ ఫారమ్‌మీద గడపాలి, నీ యిష్టం" అన్నాడు.

"తిన్నగా, స్టేషన్‌కే" అన్నాను.

రైలొచ్చింది, ఎక్కాను.

"పట్నంనుంచి, చుట్టలపెట్టెలు, పంపు" అన్నాడు.

"నేను తిన్నగా, పట్నం వెళ్లడంలేదు. మధ్యలో దిగి మేనమామని చూసి, రెండు రోజు లుండి వెడతాను" అన్నాను.

రైలు కదలడానికి సన్నాహం చేస్తోంది.

ఇంతకీ అసలువిషయం అడగడం మరిచేపొయ్యాను. 'ఎక్స్'; ఎవడు?" అనడిగాడు, రెడ్డి.

"నీకు తెలీదా?"

"నాకు నిజంగా తెలీదు."

"డిటెక్టివ్‌నవల్సులో అయితే, కథ చెప్పినవాడే హంతకుడు. దానిప్రకారం నే నన్నమాట" అని బిగ్గరగా నవ్వాను.

రైలు కదిలింది.

"నీ మొహం" అన్నాడు రెడ్డి.

నా మొహాని కొచ్చిన తిరకాసేమిటా అనుకుని మొహం తడిమి చూసుకున్నాను.

దూరమైపొయ్యాడు—అతను, అడివి, నిర్మల, వెన్నెల, పులి, పెట్రొమాక్స్, గురవయ్య, మేకపోతు, చల్లటికొలను, నల్లటిచీర, ఎర్రటిసంధ్య—అన్నీ మసగలోకి జారిపొయ్యాయి. రైలు మెలికి తిరిగింది. అదుగో దూరంగా, ప్రేమానందంబంగళా కాబోలు. దానిపక్క కొండ; కింద చెరువు.

ఆ నీళ్లలో నిర్మలప్రతిబింబం పడింది కదా—ఇంకా, దూరమైపోయింది. అడివిలో కలిసింది ఆకాశం.

* * *

మేనమామగారి వూళ్లో రెండు రోజులుండి, శనివారంమధ్యాహ్నం, మూడింటికి పట్నం చేరుకున్నాను. వెళ్లగానే, గుమ్మంలో పోస్ట్‌మన్ నిలబడ్డాడు. రిజిస్టర్డ్ కవరొచ్చిందిట. నిన్న చూసి తిరిగెళ్లిపోయాడుట. సంతకంపెట్టి, అతను వెళ్లగానే, చించి చూశాను.

"ఇంత జరిగాక నేనింక ఎవ్వరికీ దక్కను. నా పిచ్చి మధు! నీకోసం యిన్నాళ్లు నా ప్రాణాలు నిలబెట్టుకున్నాను. నన్ను భగవంతుడు పుట్టించగూడదు. నన్నొక్కదాన్ని పుట్టించి వూరుకోగూడదూ? నిన్నూ పుట్టించాడు. నువ్వు నా జీవితంలో కెందుకొచ్చావు—నన్ను ప్రేమించడానికి కాదు. నన్ను చంపడానికి. నిన్ను చూడగానే అనుకున్నాను—నా పాలిట యమధర్మరాజువని. నీ కౌగలింతల్లో, హస్తాల్లో బిగించి, నలిపిచంపుతావనుకున్నాను. అప్పటికప్పుడే, పెండ్లి స్థిరపడిపోయింది.

నన్ను రోజాపువ్వం అనేవాడివి—ఆయన ముల్లు, నువ్వు మధు త్రాగే తేనెటీగవు. ఎంతకాలం బ్రదకనిస్తారు. నాన్నతో చెప్పి, నిన్ను అత్తారింటిదగ్గరగా తెచ్చుకున్నాను. ఆయన వొచ్చినప్పుడల్లా, వేధించుకుతినేవాడు. ఏడాది గడువు కోరాను—పాపం ఎంతమంచివారు! సరేనని నన్ను తాకకుండా వొదిలేశారు. దూరంగా నక్షత్రంలా నిన్ను ప్రేమిస్తాను. నా కింకేమీ వొద్దు అనేవాడవుకాని, నిజంగా అల్లా వుండేవాడివి కావు. నాకు దగాచేసుకోడం చేతకాదు. నాకు నువ్వే కావాలి—వొక్కక్షణం—తరవాత తృప్తితో వూపిరి పూర్తిగా వొదిలేస్తాను. నీలా, దూరంగా ఆరాధన, స్నేహం, చూపులు, కవిత్వాలు నా చేతకావు.

ఆయనకి యీ వుద్యోగం అయింది. నాన్నతో చెప్పి, నిన్నూ యిందులో వేయించుకున్నాను.

ఆయనపాలిటి చిరుతపులిని నేను—నన్ను బోనులోవుంచి వినోదిస్తారు. నువ్వు స్వేచ్ఛగా అడవిలో విహరించే మొగపులివి. మనిద్దర్నీ విడదియ్యడమే, ఆయనవుద్యోగం. నీలగిరిలో నువ్వుండగా నన్ను కాపరానికి తీసికెళ్ల లేదు. తీసికెళ్లమని బ్రతిమలాడాను. సరేనన్నారు. నిన్ను ముందు బదిలీచేసి మరీ కాపరం పెట్టారు.

మళ్లా యిద్దరం నీ సన్నిధానంలో పడ్డాం. నా వ్రతం ఫలించింది. నిన్ను చూస్తూ, నువ్వు వొదిలిన శ్వాస పీలుస్తూ, నే జీవిస్తున్నాను.

మీ పట్నంమిత్రుడి ధర్మమా అంటూ, వొక్కరాత్రి నీతో గడిపే అవకాశం చిక్కింది. ఆయన బోనుతెరిచి, వేటకి వెళ్లాడు. నే నా అవకాశం వొదులుకుంటానా—? నా మధుని తెచ్చుకున్నాను. నా జన్మ తరించింది—ఆ వెన్నెల, ఆ అందం, నీ కళ్లల్లో కసి, నీ అధరాల్లో మధు—నిన్ను ధ్వంసం చేసేటందుకు పురిగొల్పాయి. మంచుని, మధునీ, పీల్చుకుని వికసించిన మొగ్గలాగైంది నా మనస్సు. దాన్ని హరించి, నాశనంచేసి, శరీరం మట్టుకు ఆయనకోసం విడిచిపెడతావా దొంగా!

మర్నాడు మధ్యాహ్నం, ఎన్నడూలేంది, ఆయనముందు చలించాను. రాత్రి నీతో అనభవం జ్ఞాపకానికొచ్చి, నన్ను రెచ్చగొట్టింది. ఆయనతో చలగాటం ఆడాను—మభ్యపెట్టాను. లాలించి, కొంటెగాచూసి ఆయన్ని పురిగొల్పాను. పులిగర్జనతో మహారణ్యం రేగినట్లు, ఆయన ఆశ్చర్యపడి, యిదేమిటా అనుకుని, ఎన్నాళ్లనుంచో అణచి పెట్టిన కామంతో, భూకంపంలాగ, అగ్ని పర్వతంలాగ, నామీది కొచ్చేశాడు. నేను గ్రహించుకున్నాను—పొరబాటు చేశానని. నా గర్వానికి, పొగరుకి తగిన శాస్తి భగవంతుడు చేశాడనుకున్నాను.

ఆయనరాక్షసత్వం నేను సహించలేకపోయ్యాను. విదిలించుకుని, తోసిపారేసి, పరిగెత్తాను. ఆయన మరింత పేట్రేగి, నన్ను తరిమారు.

'రాత్రి పులిమాదిరి తప్పించుకు పారిపోదామనుకున్నావేం!' అన్నారు.

నేను దొరికితే ఆయన చంపేద్దురు—నీకోసం ఏమీ మిగల్చకుండా. కాని, మధూ నా వెర్రిమధూ! నిన్ను తాకిన యీ శరీరాన్ని మరొకరి కివ్వడం నాచేతకాదు. నేను జారిణిగా వుండలేను. రహస్యం బ్రదుకు నావల్ల కాదు. స్వేచ్ఛగా అడివిలో సింహంలా విహరించాలి. నీ ప్రేమ నన్ను పతివ్రతని చేసిందంటే నమ్మతావా? పెండ్లి నన్ను జారిణిగా చెయ్యబోయింది. పెండ్లిని ధిక్కరించడం అంటే మరణించడం, మధూ, మాటలుకాదు.

'ఇప్పుడుకాదు, రాత్రి'—అని వీధిలో కొచ్చేశాను. ఆయనల్లా ఎక్కడికో పిచ్చివాడిలా నడిచి వెళ్లిపోయ్యారు—పాపం. ఎంతటి పరాభవం, ఎంతటి అసంతృప్తి. ఆలోచిస్తే, ఆయనే బోనలో సింహంలా కనిపించారు, నేకాదు.

వ్యవధి దొరికింది—యీ వుత్తరం వ్రాసి ముసిలిదాన్ని పోస్టుడబ్బాలో పడెయ్యమని, నేను జీవితం చాలించుకుంటున్నా. ఇంక జీవితంతో పెనుగులాడలేను. నీకోసం యింతకాలం బ్రతికాను. నిన్ను అనుభవించాను. మళ్లా సంసారంలో పడి, దగాచేసి, మోసంచేస్తూ రహస్యంగా, దుర్నీతిపాలై, తలవొంపులు భరిస్తూ, రోజులు వెళ్లబుచ్చుకోడంలో, ఏముంది మధూ! ఒక్కక్షణం విశ్వంలోవున్న అందాన్ని భరించి, మధురంగా జీవించి, పవిత్రంగా మరణించటం మంచిదికదూ?

'నిర్మల నూతులో ఎందుకు పడిందో కనుక్కున్నావా?' అన్న ఆకాశరామన్న వుత్తరం నేనే వ్రాశాను. నాకీ సంకెళ్లు తప్పతాయని నే ఎప్పుడూ అనుకోలేదు. నా జీవితయథార్థం నీకుతప్ప, ఎవ్వరికీ తెలీకపోయినా నాకు దిగులులేదు. తెలిస్తే ఆయ నెంత బాధపడతారు? నేను జీవించి వుండగా పెట్టినబాధ చాలక, చనిపోయింతర్వాతకూడా ఆయన్ని బాధపెట్టేటంతటి స్వార్థపరురాలని కాను మధూ. ఇంక నేను నీకు కనబడను. నీ రహస్యాన్ని నాతో, నాలో హతం చేసుకుంటున్నాను మధూ."

ఆ కవర్లో మరో వుత్తరం వుంది;

"మీరు నాపేరు బైటపెట్టకుండా, చమత్కారంగా కథ అల్లినందుకు కృతజ్ఞుణ్ని. దానికి ప్రతిఫలంగా, నిర్మల నాకు వ్రాసిన కడసారి లేఖలో కొన్నిభాగాలు కాపీచేసి పంపుతున్నాను—మీకు పూర్తి నిజం తెలీడం మంచిదని. ఉత్తరంవ్రాసిన మరుక్షణాన, నిర్మల యింటివెనక కాలనులోపడి ఆత్మహత్య గావించుకుంది. ఆవార్త చెప్పడానికి విచారిస్తున్నాను. స్నానంచేస్తుంటే, లోతులోకి దిగి, ప్రమాదవశంగా మరణించినట్లు పత్రికలు ప్రకటించాయి. ఇట్లు,

మధుసూదనం."

ఒకటి రెండువిషయాల్లో నేను పొరబడ్డానని వొప్పేసుగోడం మంచిది. నిర్మల యింకెప్పుడూ ఆత్మహత్య తలపెట్టదు, మరణించదు, అనేశాను. అది తప్పని, నిర్మల జీవితం ఋజువుచేసింది.

## ఆరోగ్య విజ్ఞానం:

# ఆహారసారం వొంట పట్టాలంటే-

"మీరు ఆహారాన్ని ఎలా వండుతున్నారో, ఏయే పదార్థాలు ఏ మోతాదుల్లో ఎలా తీసుకుంటున్నారో పరిశీలించాలని వచ్చాను. మీకుటుంబంతోసహా మొత్తం 64 కుటుంబాలలో ఈరీతిగా పరిశోధన చెయ్యాలని మా కాలేజివారు మమ్మల్ని నియమించారు"అని ఒక కాలేజీవిద్యార్థిని సమాజసేవాసంఘం తరఫునవచ్చి ఒక ఇంటికి వెళ్లి చెప్పింది. ఈ పరిశోధన సరిగ్గా ఒక సంవత్సరం జరుగుతుందనికూడా చెప్పింది. ఇంటిఇల్లాలు ఒక్క క్షణం ఆలోచించింది, తరవాత "అలాగే నమ్మా, ఇందులోపోయే దేముంది. ఇది మాకూమంచికే కావచ్చును. కాని మా ఇంట్లో ఎప్పుడూ ఏలోపమూ లేదు. ఇంట్లో అందరూ కడుపుపట్టినంతా తింటారు. అందువల్ల మీ పరిశోధనకి మా సంసారం పనికొస్తుందో లేదో తెలియదు" అని సమాధానమిచ్చింది.

కాని చిత్రమేమిటంటే మొత్తం 64 కుటుంబాలవాళ్లూ ఇలాగే అన్నారు; తిండి కెన్నడూ లోపం లేదనీ, తమ కే బాధ లేదనీ తిండికి కరువైతే వచ్చే రోగాలేవీ తమ ఇళ్లలో ఎవరికీ రావనీఅన్నారు. అందరూ మరీ భాగ్యవంతులూ కారు. తిండికి లోటు లేకుండా ప్రశాంతంగా జీవనం గడుపుతున్నారు. వాళ్లు స్వంతఇళ్లలో ఉంటున్నారు. అద్దెఇళ్లలో ఉండవలసిన అవసరం వాళ్లకి లేదు. చూస్తే 64 ఇళ్లలో ఉన్న మగవాళ్లు, ఆడవాళ్లు, పిల్లలు మొత్తం 239 మందీ ఆరోగ్యంగా ఉన్నట్టే కనపడతారు.

కాని కాలేజీవిద్యార్థినులు, విద్యుచ్ఛక్తి సప్లై కార్పొరేషను అధికారులు, శిశు ఆరోగ్యసంరక్షణశాఖోద్యోగులు, వైద్యాలయోద్యోగులు కలిసి చేస్తున్న ఈ పరిశోధన ఎలా ఉంటుందో, ఫలితాలెలా తేల్తాయో చూడాలని అందరూ కుతూహలంతో అంగీకరించారు. సరే ఆహారం ఆరోగ్యం మొదలైన విషయాల్ని గురించి సలహాలిచ్చే మంచి పుస్తకాలూ, కరపత్రాలూ చదవడం ఆరంభించారు.

పరిశోధన ముందుగా అందరినీ వైద్యులు పూర్తిపరీక్ష చెయ్యడంతో ఆరంభమయింది. మనుషుల ఒడ్డుపొడుగులూ, బరువూ వ్రాసి ప్రతి ఒక్కరికీ సంబంధించిన వివరాలతో పత్రాలు తయారుచేశారు. ఎముక లెలా ఉన్నాయో చూడ్డానికి అందరికీ ఎక్స్‌రే ఫోటోలు తీశారు. రక్తం పరీక్షచేశారు. మైక్రోస్కోప్ సహాయంతో చర్మాన్ని పరీక్షచేశారు. కళ్లు, పళ్లు, చిగుర్లు, నాలుక పరీక్షచేశారు. నెత్తురు పరీక్షచేసి ఖనిజ సారం మొదలైన వే రీతిగా ఉన్నాయో పరీక్షచేశారు. ఈవిధంగా పరీక్షచేసి ఫలితాల్ని పత్రాలు తయారుచేశారు.

మొదట జరిగిన ఈ వైద్యపరీక్షఫలితాలు చూసేసరికి ఇల్లాళ్లు విస్తుపోయారు. అందరూ తిండి కెన్నడూ ఏలోటూ లేనివాళ్లే అయినా, వైద్యపరీక్షవల్ల దాదాపు అందరికీ ఆహారం చాలడంలేదని రుజువయింది. చాలకపోవడంవల్ల దేహపుష్టిలో లోపం కనిపించినా ఈలోపం ప్రమాదమయినది కాదు. కాని లోపం ఉండడంమాత్రం నిజం. ఆహారాన్ని సక్రమంగా తీసుకోకపోవడంవల్ల ఈ లోపం సంభవిస్తోంది. ఇప్పటికే ప్రమాదభయం లేకపోయినా, ఈరీతిగానే ఆహారం తీసుకోడాన్ని అనుసరిస్తుంటే కాలక్రమేణా ఆ భయానికి అవకాశం ఉంటుంది.

పురుషులకంటె స్త్రీలలో ఈ లోపం అధికంగా కనపడింది. నూరింట 60 మంది వయసుకీ ఒడ్డుపొడుగులకీ తగినంత బరువు లేరు. వారికి ఆహారంవల్ల లభించవలసిన జీవధాతువులు (విటమిన్స్), మాంసకృత్తులు (ప్రొటీన్స్), ఖనిజసారాలు కావలసినంతగా అందడంలేదు. (కొందరు ఒళ్లుపెరిగిపోకుండా ఎప్పుడూ సన్నగా నాజూగ్గా ఉండాలనే కోరికతో ఆహారం తక్కువగా తీసుకుంటారు కూడా). ఎముకలవృద్ధికి అవసరమైనదానికంటె కాల్షియం తక్కువ

---

ఆత్మహత్య పాపమా, మంచా, అని నిర్వచనంచేసి, ఆమెజీవితానికి విలువకట్టే, అధికారం నా కేమీ కనబడలేదు. భర్తని ప్రేరేపించి, అందులోంచి తప్పించుకున్న దృశ్యం స్మరిస్తే భయమేస్తుంది. నా గర్వానికి, పొగరుకి తగిన శాస్తి జరిగిందని, తనే అన్నది.

పతివ్రతగా మరణించడమా? జారిణిగా బ్రదకడమా? అదీ ఆమెవిషమసమస్య; సమాధానం ఆమె చెప్పేసింది.

పతివ్రత ప్రేమించటం అనేది మన సంప్రదాయానికే విరుద్ధం. ప్రేమించకపోవడం, మానవత్వానికి విరుద్ధం. ప్రేమించడం అంటే నా బోటి నాగరికుల కేం తెలుసు? ప్రేమలో అడివితత్వం, ప్రాచీనత్వం, వుంటాయి. ప్రేమతత్వానికీ, నాగరికతకీ సమన్వయం కుదరదు. మనం ప్రేమకి విలువకడతాం, దాని లోతులు వితర్కిస్తాం. అర్థంచేసుకుంటాం. ప్రేమించడంగురించి ఆలోచిస్తాం, కాని, ప్రేమించడం నాగరీకులచేత కాదు. నిర్మలని ఏ బోనులో బంధించగలం? ప్రేమని ఏనీతినియమంతో అరికట్టగలం? వొచ్చేసేటప్పుడు, వేళాకోళంగా, నేనే హంతకుణ్ణి అన్నాను రెడ్డితో. ఎంత నిజం! నేనా అవకాశం కల్పించకపోతే, నిర్మలింకా జీవించేవుండును.

నా కేమీ విచారంలేదు. నా అల్పత్వం, అనావశ్యకత, నాకు తెల్లమయ్యాయి. నే కల్పించిన అవకాశంవల్ల, మరొక జీవి విముక్తిపొందాడు ఆమె భర్త. ఈ విషయాలన్నీ, మధుసూదనాన్ని సంబోధిస్తూ, వుత్తరం వ్రాశాను.

కాని వుత్తరంలో నాకు విశ్వాసం కుదరలేదు. యథార్థాన్ని యెదుర్కొన్న తర్వాత, భాష, భావాలు, సానుభూతులు నైతిక, ఆధ్యాత్మికవిలువలు, హాస్యాస్పదంగా గోచరించాయి. మధ్య నే నెవర్ని అని, మన వేదాలు బోధించినప్రకారం ప్రశ్నించుకుని, ఉత్తరం చించివేశాను.

అందుతోంది. పిల్లల్ని కనే ఈడులో ఉండే స్త్రీలకు పురుషసమయంలోనూ ఆ తరవాత శిశుపోషణలోనూ అవసరమైనంతగా సమృద్ధిగా కాల్షియంలభించడంలేదు.

తల్లులతరవాత ఇరవై ఏళ్లలోపు బాలికలు. వీరిలో సగంమందికిపైగా తూకం బొత్తిగా తక్కువున్నారు. చాలమందికి మొటిమలు, శోభిమొదలైన వున్నాయి. ప్రతి అయిదుమందిలో ఒకరికి చొ॥ ఇనుము పదార్థం తక్కువుంది. ప్రతిముగ్గురిలో ఒకరికిచొ॥ కాల్షియంలోపం ఉంది. అందరికీ 'డి' విటమిన్ లోపమే. అంటే ఎముక పెరుగుదల్లో లోపం ఉందన్నమాట.

ఆడవాళ్లకంటె మగవాళ్లు ఇరవై ఏళ్ళలోపు బాలురూ మెరుగు.

అయితే వీరిలో కూడా పచ్చి కూరగాయలు తీసుకోడం నాజూకు (ఫేషన్) కాదుగాబట్టి 'సి' విటమిన్ (కాల్షియం) బొత్తిగా లోపం, నూరింట 60 మంది బాలురు తూకం తక్కువగా ఉన్నారు. ఎముకబలం నూరింట 23 మందిలో లోపం. అందరిలోనూ ఆయాసం, నరాల బలహీనత కనిపిస్తుంది. దీనికి కారణం 'బి' విటమిన్ల కొరత.

అందరికంటే పన్నెండేళ్లలోపు పిల్లలు మెరుగు. వాళ్ళకి ఆహారంవల్ల కావలసిన పదార్థాలన్నీ శరీరానికి అందుతున్నాయి. వాళ్లకి ఆహారం సక్రమంగా ఉన్నట్లు కనపడింది. అయినప్పటికీ కొంతమంది బలహీనంగానూ (తూకంతక్కువ) ఎముకలబలం తక్కువగానూ ఉన్నారు.

అసలులోపం ఎక్కడుందంటే కంటికి నదరుగా కనపడేవీ, రుచిగా ఉండేవీ ఆహారపదార్థాలు ఎప్పుడూ బలవరకంగా ఉండవనే సంగతి తెలియదు. కండరాల వృద్ధికి మాంసకృత్తు లవసరమనీ, బలానికి పిండిపదార్థా లవసరమనీ, పళ్లు ఎముకలూ బలపడ్డానికి కాల్షియం అవసరమనీ, నెత్తురు వృద్ధికి ఇనుపపదార్థా లవసరమనీ, నరాల బలానికి 'బి,' విటమిన్లు అవసరమనీ చాల మందికి తెలిసి ఉండవచ్చును. కాని తినే ఆహారంలో ఈ పదార్థాలన్నీ కావలసిన మోతాదులో ఉన్నాయో లేవో, ఎవరికీ అంతుపట్టదు. 64 ఇళ్ళలోనూ ఇల్లాళ్లకి ఈ కిందివిషయాలు తెలియచెప్పారు. అవసరమైన పదార్థాలప్రకారం ఆహారపదార్థాల్ని 11 భాగాలుగా విభజించవచ్చును.

1. పాలు, వెన్న. 2. మాంసం, చేపలు. 3. కోడిగుడ్లు. 4. చిక్కుళ్లు, వేరుసెనగ. 5. ఆకుకూరలు. 6. నిమ్మకాయలు, నారింజకాయలు మొదలైనవి, టొమాటోలు. 7. ఇతర ఫలాలు, కాయకూరలు. 8. బంగాళా దుంప మొదలైనదుంపలు. 9. పప్పులు, కుడుములు, రొట్టెలు. 10. నెయ్యి, నూనె మొదలైన కొవ్వుపదార్థాలు. 11. పంచదార, బెల్లం.

ఆహారంలో ఈ పదకొండు భాగాలకు చెందినవి ఒక్కొక్కటి చొప్పునైనా ఉండితీరాలి. ఈరీతిగా ప్రతిరోజూ ఆహారం తీసుకుంటే ఏలోపం రావడానికీ వీల్లేదు కాబట్టి ఈవిధంగా ఇకనుంచి ఆహారం తీసుకోవాలని 64 కుటుంబాలవారికీ చెప్పారు.

ఈజాబితా చూసేసరికే ఇదివరకు చేసిన పొరపాట్లని గ్రహించారు. అంతవరకూ వాళ్ల ఇళ్లలో ఎవరికీ తిండికి లోటు లేకపోయినా సక్రమంగా మాత్రంలేదని తెలుసుకున్నారు. వంటకాల్ని ఈజాబితాప్రకారం ఎప్పుడే పదార్థాలు తీసుకోవాలో మొత్తం 36 రకాలు జాబితా తయారుచేసి వానిలో ఎంచుకోడానికి అవకాశం ఇచ్చారు.

ఇంతే కాదు. ఇంకొక పెద్ద పొరపాటుంది. వస్తువుల్లోని ఆహారసారాన్ని వంటలో పాడుచేస్తున్నారు.

పచ్చికూరగాయల్ని ఎండబెట్టేస్తారు. దీనివల్ల వానిలోని జీవధాతువులు కొన్ని చచ్చిపోతాయి. చిక్కుళ్లు మొదలైనవాటిని నీళ్లలో నానవేసి, కొంతసేపయిన తరువాత నీళ్లు పారపోసి కూర చేస్తారు. దీనివల్ల నీటిలో కరిగిపోయే విటమిన్లు, ఖనిజసారాలు నీళ్లలో కొట్టుకుపోతాయి. కూరలో అంతవరకూ ఆ విటమిన్లు నష్టమై పోతున్నాయి. కాబేజీ, అనపకాయ, గుమ్మడికాయ మొదలైనవాటిని తరిగి ముక్కల్ని రోజూ, రెండు రోజులూ ఉంచుతారు. దీనివల్ల 'సి' విటమిన్ చచ్చిపోతుంది. చాలా కూరల్ని ఎక్కువ నీళ్లలో పోసి చాలసేపు ఉడకబెడతారు. దీనివల్ల ఖనిజసారాలు విటమిన్లు నష్టమైపోతాయి.

కూరల్ని ఉడకబెట్టవలసిన పద్ధతి వేరు. జిగురెక్కకుండా ఉంచడానికి ఎన్నినీళ్లు కావాలో అంతమాత్రమే తక్కువగా నీళ్లు పోసి అందులో కూరలు వేసి గిన్నెపైన మూతపెట్టి ఉడకపెట్టాలి. అలా ఉడకపెట్టితే విటమిన్లు, ఖనిజసారాలు నష్టమైపోవు. రుచి కూడా అధికంగా ఉంటుంది. మాంసవస్తువుల్ని ఎంచడంలోనే పొరపాటుంది. నిలవచెయ్యడం, వండడంకూడా పాడుగానే ఉన్నాయి. మాంసంలో రకాలు మార్చరు.

కొత్తపద్ధతుల్ని 64 ఇళ్లలోనూ అనుసరించడం ఆరంభించారు. ఆరుమాసాల అనంతరం తిరిగి వైద్యపరీక్ష జరిపారు. ఆరోగ్యం చాలా మేలుగా ఉన్నట్లు కనపడింది. ఇంక ఆ ఇళ్లలో కొత్త పద్ధతులు అలవాటైనాయి. సంవత్సరం పూర్తిఅయిన తరవాత తిరిగి సమగ్రవైద్యపరీక్ష జరిగింది. చర్మంచాయ బాగుపడింది. పళ్లు, చిగుళ్లు, నాలుక పరిశుభ్రంగా ఉన్నాయి. నరాల బలం హెచ్చింది. నరాల బలహీనత పోయింది. ఆయాసం పూర్తిగా పోయింది. జ్వరాలు వగైరా చాలావరకు తగ్గిపోయాయి.

అందరిలోనూ బలం, తూకం వృద్ధి అయినాయి. ఇరవై ఏళ్లలోపు యువతుల్లో ఆరోగ్యం చాలా వృద్ధి అయింది. ఎముకలు బాగా బలపడ్డాయి. చాలామందికి కాల్షియం లోపం పోయింది. ఆకలి, జీర్ణశక్తి బాగుపడ్డాయి. స్త్రీలలోమాత్రం పురుషుల్లో కనిపించినంత వృద్ధి కనిపించలేదు. కాని మొత్తంమీద వాళ్ల ఆరోగ్యం కూడా వృద్ధి అయింది. (నాజూగ్గా ఉండాలనే కోరికతో స్త్రీలు పూర్తిగా కడుపు పట్టినంత ఆహారం తీసుకోకపోవడం కారణం కావచ్చును.)

పద్ధతిమార్పుతోపాటు అందరికీ ఆకలి వృద్ధి అయి తీసుకునే ఆహారంపరిమాణం పెరిగింది. ఆహారంవిషయంలో సక్రమమైన పద్ధతుల్ని అవలంబిస్తే ఆరోగ్యం వృద్ధికావడమే కాక ఇళ్లలో ఇల్లాళ్లకి పరిశ్రమకూడా తగ్గుతుందని ఈ పరిశోధనవల్ల తెలిసివచ్చింది.

['హైజిన్' పత్రికనుంచి.]

# భారతరిపబ్లిక్ రాజ్యాంగం

(16 వ-పేజీ తరువాయి)

అధికారం కేంద్రపార్లమెంటుకీ, రిపబ్లిక్ అధ్యక్షునికీ ఇవ్వబడింది ఈమాదిరి నిబంధన ప్రపంచంలోని ఏ దేశరాజ్యాంగంలోనూ లేదు.

కాంగ్రెస్‌వాదులురాష్ట్రశాసన సభల్లో ప్రవేశించి,ఇచ్చిన పరిమిత ధికారాన్ని హస్తగతంచేసుకుని, సమయం వచ్చినప్పుడు బ్రిటిష్‌పాలకుల ఆజ్ఞల్ని ధిక్కరించగలరనే భయంతో, అటువంటి పరిస్థితుల్లో జాగ్రత్తపడ్డంకోసం బ్రిటిష్‌పాలకులు 1935 భారతరాజ్యాంగశాసనంలో అటువంటినిబంధన ప్రవేశపెట్టారు. ఇప్పుడు పాకీస్తాన్ పుణ్యమా అని దేశంలో మతకలహాలు సంభవించేపక్షంలోనూ, ఏ రాష్ట్రానికైనా సమీపరాజ్యంవల్ల దాడిప్రమాదం సంభవించేపక్షంలోనూ, కమ్యూనిస్టుల ముప్పు సంభవించేపక్షంలోనూ రాష్ట్రాలను కల్లోలంనుంచి రక్షించడంకోసం భారత రాజ్యాంగంలో ఈ నిబంధన తిరిగి ప్రవేశపెట్టవలసిన అవసరం కలిగింది.

కేంద్రప్రభుత్వమూ, పార్లమెంటూ ఈ విధంగా పరిపాలనాధికారాన్ని అధికంగా తీసుకున్నందువల్ల రాష్ట్రస్వపరిపాలన సిద్ధాంతం విస్మరించబడిందని కొందరు విమర్శించారు. బ్రిటిష్‌పాలకు లున్నంతకాలమూ కాంగ్రెస్‌సంస్థ రాష్ట్రస్వపరిపాలనా వ్యవస్థనేకాక స్వయంనిర్ణయసిద్ధాంతాన్ని కూడా బలపరిచింది. కాని పాకీస్తాన్ నిర్మాణంతో పరిస్థితి తారుమారయిపోయింది. రాష్ట్రాల సంరక్షణబాధ్యత భారతరమైపోయింది. భాషారాష్ట్రనిర్మాణంవిషయంలో కూడా ఇదేరీతిగా కాంగ్రెస్‌సంస్థ దృక్పథం మారిపోయింది

వైవిధ్యంలోనే సమీకరణావకాశం అధికమని శ్రీ అరవిందమహర్షి అన్నారు. భారత జాతీయతవిశిష్టలక్షణం వైవిధ్యమన్నారు. వ్యక్తులపైన నిర్బంధాలు అధికంగా విధిస్తే వికాసం కుంటుపడినట్లే. రాష్ట్రాల స్వపరిపాలనాధికారాన్ని పరిమితంచేస్తే అసలు పరిపాలనఅంతటా క్రమంతప్పే ప్రమాదం ఉందని కొందరి వాదన. సర్వాంగపుష్టే దేహానికిపుష్టి. నిరంకుశనిర్బంధాల నెదిరించి పోరాడి స్వేచ్ఛాస్వాతంత్ర్యాల నార్జించుకోవడమే

6

ఇంతవరకూ ప్రజాస్వామ్యశక్తులు జరుపుతున్న పోరాటం. వ్యక్తిస్వత్వాలపై అనుచిత అన్యాయ నిర్బంధాలను తొలగించి మానవసహజస్వత్వాలను ప్రకటించి నప్రెంచి, అమెరికన్ స్వాతంత్ర్యవీరులే భారతజాతీయ కాంగ్రెస్‌కు ఆదర్శపురుషులు. అటువంటి జాతీయసంస్థ వ్యక్తిస్వత్వాలపైనా, రాష్ట్రస్వపరిపాలనాధికారంపైనా ఈ రీతిగా నిర్బంధాలు విధించి పరిమితం చెయ్యడం అనేకమంది విమర్శలకు పాలయింది. ఇది ప్రజాస్వామ్యసిద్ధాంతాలకు పూర్తిగా విరుద్ధమని సోషలిస్టులు విమర్శిస్తున్నారు. కాని ఈనాడు ఏ దేశంలో చూసినా ప్రభుత్వాల అధికారఆధిక్యతే గోచరిస్తోంది. మానవసమాజంఅంతటికీ ఇది పెద్దసమస్యగా మారింది. ప్రజాసామాన్యంక్షేమంకోసం, దేశక్షేమంకోసం వ్యక్తిస్వత్వాలనూ, ప్రాంతీయస్వపరిపాలనాధికారాల్నీ పరిమితం చెయ్యవచ్చుననే వాదం క్రమంగా ప్రపంచంలో బలపడుతోంది. అంతర్జాతీయవ్యవహారాల పరిస్థితిదృష్ట్యా దేశఆర్థికరాజకీయ సంరక్షణనిమిత్తం ప్రభుత్వాలు బలపడవలసిన అగత్యం కనిపిస్తోంది. ప్రజల ఆర్థికసముద్ధరణ ప్రధానమనీ వ్యక్తిస్వత్వాలు ద్వితీయమనీ చెప్తున్నారు. ప్రజాస్వామ్యపరిపాలనాసిద్ధాంతాల్లోనే పెద్దమార్పులు వచ్చాయి.

"మానవుల కనీసహక్కులు ఆహారం, వస్త్రం, నివాసం" అని బ్రిటిష్‌కార్మిక నాయకుడొకడన్నాడు. వీనిని ప్రజలందరికీ ఇవ్వడంకోసం మానవస్వత్వాల్ని పరిమితంచెయ్యవచ్చునని వెల్ఫేర్ స్టేట్‌వాదులంటున్నారు.

వాస్తవానికి ప్రజల ఆర్థికసముద్ధరణకోసం ప్రభుత్వాలీవిధంగా చెయ్యడం లేదనీ, పార్లమెంటరీరాజకీయాల్లో ఇదొకస్థితి అనీ కొందరంటున్నారు. పరిపాలనావ్యాసంగంలో ఆరితేరిన రాజకీయపక్షాలు తమ పరిపాలన శాశ్వతపరుచుకోడంకోసం ప్రజాసత్తాకరాజ్యాంగాన్ని ఈ రీతిగా మార్చివేస్తున్నారని వీరి వాదన.

ఏది నిజమైనప్పటికీ ఆయా సిద్ధాంతాలు మంచివో చెడ్డవో ఎంచడానికి లక్ష్యశుద్ధిని గమనించాలని గాంధీజీ మనకు నేర్పారు. ఈ రాజ్యాంగవిధానాన్ని నిర్ణయించడంలో ప్రజలక్షేమమూ, దేశక్షేమమే ప్రధానవిషయాలుగా కాంగ్రెస్‌వారెంచారని చెప్పక తప్పదు. అందువల్ల కేంద్రంలో నెహ్రూ పటేల్ వంటినాయకులు ఆధిపత్యం వహించినంతవరకూ ఈ నియమాలు దేశానికి ప్రయోజనకరంగానే ఉండగలవు.

రాష్ట్రాలలో ఈనాడు పరిపాలనావిధానాన్ని గమనించినా, కాంగ్రెస్‌సంస్థ ఏస్థితిలో ఉందో గమనించినా కేంద్రప్రభుత్వం బలీయంకావడం దేశానికి క్షేమమేనని చెప్పవలసివస్తోంది.

కాని ఏప్రభుత్వంగాని అధికారాన్ని దుర్వినియోగపరచదలిచినట్లయితే ఆ ప్రభుత్వంనుంచి ప్రజల్ని రక్షించడానికి మార్గం లేదు. రాజ్యాంగంలో ఈ లోపం మున్ముందు ఇంకా గోచరం కాగలదు.

## భాషారాష్ట్రాలు:

భాషారాష్ట్రాలకు సంబంధించినంతవరకూ కాంగ్రెస్ సంస్థనిర్ణయాలు సమర్థనీయం కాజాలవు. ప్రజలక్షేమంకోసం ప్రజల ప్రతినిధులద్వారా ప్రభుత్వాన్ని నడపాలంటే మాతృభాషకి పరిపాలనలో ప్రధానస్థానం ఇవ్వాలనేది సర్వజనాంగీకారమైన ప్రజాస్వామ్యసిద్ధాంతం. కేంద్రప్రభుత్వం అసాధారణాధికారాలు తీసుకున్నతరవాత "భాషావాదపిశాచం" దేశాన్ని పట్టి పీడించే ప్రమాదమేమీ ఉండదు. ప్రజలకు ప్రభుత్వాలు, శాసననిర్ణేతలు సన్నిహితంగా మసలాలంటే, ప్రజలకి ప్రభుత్వకార్యకలాపాలు సుబోధకంకావాలంటే మాతృభాషలో సర్వపరిపాలనాకార్యకలాపం జరపాలి. ఈ సౌకర్యం లేనిచోట ప్రజాస్వామ్యసిద్ధాంతప్రకటనలన్నీ వ్యర్థం. పాకీస్తాన్ దాపున ఉండగా జాతీయైక్యతా భగ్నప్రమాదం ఉండదు. వివిధరాష్ట్రాల మధ్య వైషమ్యాలు వచ్చినా అట్టే దూరం పోలేవు. అన్నివిధాలా (ఆర్థికంగా కూడా) కేంద్రప్రభుత్వమును, పార్లమెంటు, రిపబ్లిక్ అధ్యక్షుని ప్రాపుపైన ఆధారపడవలసిన రాష్ట్రాలు భాషావాదంవల్ల జాతీయైక్యతను భగ్నపరుస్తాయనేది అసంభవం.

రాజ్యాంగపత్రంఆరంభంలోనే కొత్త రాష్ట్రాల నిర్మాణానికి అవసరమైన నిబంధనలు విధించబడినాయి. రాజ్యాంగాన్ని సవరించవలసిన అవసరంలేకుండా, 3 (ఎ) నిబంధనప్రకారం పార్లమెంటు ఒక శాసనం ద్వారా కొత్తరాష్ట్రాన్ని నిర్మించవచ్చును. కొత్తరాష్ట్రంనిర్మాణానికి సంబంధించిన రాష్ట్రాల శాసనసభల అభిప్రాయాన్ని తెలుసుకుని, కొత్తఅధ్యక్షుడు రాష్ట్రంనిర్మాణానికి పార్లమెంటుకు రిపబ్లిక్ అధ్యక్షుడు సిఫార్సు చెయ్యాలి.

జాతీయైక్యతాసాధనకోసం సంస్థానాలలో రాజ్యాంగవ్యవస్థ రాష్ట్రాలలో వ్యవస్థతో సమీకరించబడింది. రాష్ట్రాలు సంస్థానాలమధ్య పౌరస్వత్వాలు, రవాణా, వర్తకుల విషయాలలో సర్వనిషేధాలు తొలగించబడతాయి. విశ్వవిద్యాలయాల విషయంలోమాత్రం ఈ ఐక్యతాసాధనకు యత్నం జరగలేదని చెప్పాలి.

ఒక రాష్ట్రంలోనివారు మరొక రాష్ట్రంలోని విశ్వవిద్యాలయాల్లో (ఏఒకటి రెండో తప్ప) అభ్యసించాలంటే అనేకఆటంకాలున్నాయి. విద్యార్థుల వేతనాలు రెట్టింపు చెయ్యబడతాయి. కొన్ని విశ్వవిద్యాలయాల్లో ప్రవేశమే కష్టం. విద్యాభ్యసన సందర్భంలో రాష్ట్రాలమధ్య అంతరాలు, నిర్బంధాలు తొలగించవలసిన అవసరం ఉంది. వీనిని తొలగించడానికి రాజ్యాంగంలో ఏర్పాటు చెయ్యబడలేదు కాని రాజ్యాంగాన్ని సవరణ చెయ్యనవసరం లేకుండా అవసరమైన మార్పులు చెయ్యడానికి ఆయావిశ్వవిద్యాలయాలకి అధికారం ఉంది. రాష్ట్రప్రభుత్వాలుకూడా కృషి చెయ్యడానికి వీలుంది.

## న్యాయస్థానాలు:

బ్రిటిష్‌పార్లమెంటరీ, జుడిషల్ విధానాలే భారతరాజ్యాంగంలో అనుసరించబడినాయి. రాజ్యాంగనియమాల నిరూపణకే కాని నిర్వచనకు న్యాయస్థానాలకు అధికారం లేదు. అధ్యక్షునిచే నియమించబడే న్యాయమూర్తులికి ఈ అధికారం ఇస్తే, న్యాయవిచారణలోకూడా రాజకీయపార్టీల తంత్రాలు ప్రవేశించే ప్రమాదం ఉంది కాబట్టి ఆ అధికారం ఇవ్వలేదని పండిట్ నెహ్రూ చెప్పారు.

న్యాయపరిపాలన రాజకీయాల్లో పడిపోకుండా, ప్రభుత్వాల చంచలవిధానాలకి బలి కాకుండా తగు ఏర్పాట్లు చెయ్యబడినాయి. ప్రభుత్వోద్యోగనియామక సంస్థలు, ఆడిటర్ జనరల్, ఎన్నికలశాఖలు నిత్యమూ ప్రభుత్వాధికారానికి లోబడి ఉండకుండా స్వతంత్రనిర్వాహక సంస్థలుగా నిర్మించబడతాయి. ఈ శాఖల్లో అధికారుల్ని రిపబ్లిక్ అధ్యక్షుడే నియమిస్తారు. సుప్రీంకోర్టులోనూ హైకోర్టుల్లోనూ న్యాయమూర్తుల్ని రిపబ్లిక్ అధ్యక్షుడే నియమిస్తారు. వారిని ఉద్యోగచ్యుతుల్ని చెయ్యడం కష్టమైన పని. ఒక జడ్జీని బర్తరఫ్ చెయ్యాలంటే పార్లమెంటు మూడింట రెండువంతుల మెజారిటీవోట్లతో తీర్మానం చెయ్యాలి.

ప్రప్రథమంగా భారతదేశంలో సార్వజనీన నియోజకవర్గవిధానం అమలు జరుగుతుంది. పేదలు, ధనవంతులు, స్త్రీలు, పురుషులు మొదలైనభేదాలతో నిమిత్తంలేకుండా అందరూ ఎన్నికల్లో పాల్గొనడానికి ఏర్పాటు చెయ్యబడుతుంది. నిమ్నజాతులవారికి తప్ప మిగతావారిలో ఎవ్వరికి జాతిమతకులాది భేదాలపైన నియోజకవర్గాల్లో ప్రత్యేకత ఉండదు. శాసనసభల్లో సభ్యత్వానికి పోటీ చెయ్యడానికి అందరికీ హక్కుంటుంది.

## రాజ్యాంగసవరణ

ఇంగ్లండులో రాజ్యాంగమేదీ రచింపబడనందువల్ల కాలగతికి అనుగుణంగా సంస్కరణలు ప్రవేశపెట్టడానికి అనువౌతోందనీ, బ్రిటన్‌లో ప్రజాస్వామ్యవిధానం వర్ధిల్లిందంటే దానికి అదే హేతువనీ చెప్తారు. అమెరికన్ రాజ్యాంగంలో విధించబడిన నియమాలు బహుకొద్ది విధించబడకపోయినా కాలక్రమేణా ఆచరణలో అనుభవాన్నిబట్టి ముఖ్యపరిపాలనాసిద్ధాంతాల్ని కూడా అనుకూలంగా సంస్కరించుకోడానికి వీలయింది. భారతరాజ్యాంగంలో సర్వవిషయాల్నీ ఏకరువుపెట్టి దూరదృష్టితో అన్ని పరిస్థితుల్నీ గమనించి అన్నిటా జాగ్రత్త వహించారు. సవరణలు తీసుకురావడం భారతరాజ్యాంగంలో అంత కష్టం కాదు. పార్లమెంటులో మూడింట రెండువంతుల మెజారిటీతో తీర్మానించేస్తే రాజ్యాంగనియమాల్లో సవరణలు తేవచ్చును.

కాని రాజ్యాంగం సర్వవిషయాల్నీ కూలంకషంగా క్రోడీకరించి నిబంధనలు విధించినందువల్ల పరిణామదశలకి తట్టుకోలేకపోవచ్చునని కొందరి అంచనా. ఇది అసలు రాజ్యాంగప్రణాళిక కాదనీ, ప్రభుత్వపరిపాలనావిధానక్రోడీకరణ అనీ కొందరు విమర్శిస్తున్నారు. అందువల్ల మొదటినుంచీ దేశస్థితిగతుల మార్పుల్నిబట్టి రాజ్యాంగాన్ని సంస్కరించవలసిన అవసరం కలగవచ్చును. ఒక అర్ధశతాబ్దంలో ఈ రాజ్యాంగం పోలికైనా లేకుండా సంస్కరించబడినా ఆశ్చర్యపడనవసరం ఉండదు.

వాస్తవమేదయినప్పటికీ, డా॥ రాజేంద్రప్రసాద్ చెప్పినట్లు భారతదేశభవిష్యత్తు రాజ్యాంగలక్షణంపైనే కేవలం ఆధారపడి ఉండదు. ఆ రాజ్యాంగాన్ని నిర్వహించే నాయకులపై ఆధారపడిఉంది. కాంగ్రెస్ సంస్థకిది పరీక్షాసమయం. బాధ్యతాభారాన్ని గుర్తించి, రాజకీయతంత్రాలకంటె దేశపాలన, దారిద్ర్యనివారణ, పరిపాలనలో లక్ష్యశుద్ధి ప్రధానమైనవని కాంగ్రెస్ నాయకులు, ముఖ్యంగా రాష్ట్రనాయకులు గుర్తించినట్లయితే రిపబ్లికన్ రాజ్యాంగంవల్ల భారతదేశానికి భాగ్యోదయం కాగలదు.

---

# ★ కామన్వెల్త్ విదేశాంగమంత్రుల సమావేశం

## ★ ఆసియా పట్ల బ్రిటన్ అమెరికాల వైఖరి

కామన్వెల్తు విదేశాంగమంత్రుల సమావేశం కొలంబోలో సరిగా వారంరోజులు జరిగింది. కామన్వెల్తుదేశాలకు సంబంధించినంతవరకూ ఆసియాలో రాజకీయ స్థితిగతుల్ని గురించి చర్చ జరిగింది. ఆసియాలోని ఆయా దేశాలపట్ల కామన్వెల్తుదేశాల వైఖరినిగురించి చర్చజరిగింది. ఈ సందర్భంలో కామన్వెల్తుదేశాలన్నీ ఒక్క తాటిమీద నడవాలని అమెరికా మొదలైన పాశ్చాత్య ప్రభుత్వాలు ఆశించాయి. బ్రిటన్ కూడా తన విధానాల్ని ఇండియా మొదలైన దేశాల చేత అనుసరింపచెయ్యడానికి మొదట ఆశించినప్పటికీ అది అసంభవమని కొలంబో సమావేశంలో తేలిపోయింది. కమ్యూనిజం ప్రమాదాన్ని నిరోధించే విషయంలోకూడా ఏకాభిప్రాయం కుదరలేదు. కుదరనందువల్ల కామన్వెల్తుదేశాలకు పెద్ద ఆశాభంగం కలగ లేదు. అయితే ఆస్ట్రేలియా న్యూజీలాండ్ ప్రభుత్వాలకి కామన్వెల్తులోని ఆసియా దేశాలపట్ల అసంతృప్తి కలిగింది.

కొలంబోసమావేశంలో ఎట్టి నిర్ణయాలూ జరగలేదనీ, ఆ సమావేశంవల్ల అంతర్జాతీయ రాజకీయాల్లో భారతదేశం అనుసరించవలసిన విధానం ఏదీ నిర్దేశించబడలేదనీ, కామన్వెల్తు దేశాల స్వాతంత్ర్యవర్తనకు ఆటంకమేమీ లేదనీ పండిట్ నెహ్రూ కొలంబోసమావేశంఅనంతరం స్పష్టపరిచారు. ఈ సమావేశంవల్ల ఆయా దేశాల వైఖరి అందరికీ స్పష్టపడింది. ఒకరి విధానాన్ని మరొకరు అర్థం చేసుకోడానికి సహాయపడేందుకుమాత్రమే ఈ సమావేశం ఏర్పాటయిందని ముందే ప్రకటించారు. కొలంబోసమావేశ ఫలితంగా అంతర్జాతీయ వ్యవహారాల్లో భారతప్రభుత్వ విధానంలో ఎలాంటి మార్పులూ సంభవించవు.

సమావేశంలో జపాన్‌తో సంధి, కమ్యూనిస్టుచీనాతో వ్యవహారాలు, ఇండోచీనా, ఆసియా దేశాలలో కమ్యూనిస్టుప్రమాదం ఆర్థిక దుస్థితి, మలయా పరిస్థితి, బర్మాకి ఆర్థిక సహాయం మొదలైన విషయాలు చర్చించబడినాయి.

జపాన్‌తో సంధిషరతులవిషయమై అమెరికా ఇదివరలో ఒక పత్రాన్ని తయారుచేసింది. కాని రష్యావైఖరి మూలంగా అసలుపత్రం చర్చించబడనే లేదు ఇప్పుడు బ్రిటన్ ప్రయత్నిస్తోంది. కాని ఎవరు యత్నించినప్పటికీ రష్యాతో సఖ్యతకు సిద్ధపడితేకాని ఈ పని వీసమైనా కొనసాగదు. జపాన్‌లోనే తిష్ఠవేసుకుని కూచోదల్చుకున్న అమెరికాకు వాస్తవంగా సంధి జరగడమే ఇష్టంలేదు. కేవలం ఆసియావాసుల తృప్తికోసం ఏదో పత్రం తయారుచేసి కృషిచేసినట్లు నటించిందంతే. రష్యాకి బొత్తిగా నచ్చని షరతులు ప్రతిపాదించి సంధిజరక్కుండా జాగ్రత్తపడుతోంది. జపాన్‌నుంచి తమ సైన్యాల్ని ఉపసంహరించకోడం అమెరికాకు ఇష్టం లేనందువల్లనే జపాన్‌తో సంధి ఇప్పట్లో జరగడం అసంభవమని గ్రహించిన పండిట్ నెహ్రూ కొలంబోలో తన అభిప్రాయాన్ని బ్రిటన్‌కి తెలిపారట. జపాన్‌నుంచి అమెరికన్ సైన్యాలు వెంటనే తొలగిపోయినట్లయితే సంధిషరతులపై అన్నివర్గాలమధ్యా సఖ్యత కుదరడం సాధ్యమని చెప్పారు.

అమెరికాసన్నాహాలుగురించి పూర్తిగా తెలుసుకున్న రష్యా జపాన్‌లో కమ్యూనిస్టుల్ని తీవ్రవిప్లవానికి రెచ్చగొట్టుతోంది. ఇంతవరకూ శాసనబద్ధరాజకీయోద్యమం ద్వారా క్రమంగా శాంతియుతమైన విప్లవాన్ని సాధించాలని తలిచిన జపాన్ కమ్యూనిస్టులు ఈమధ్యనే ఆ విధానాన్ని మాని, తీవ్రవిప్లవం తీసుకురావడానికి కృషి చెయ్యగలరని తీర్మానించుకున్నారు.

ఇంతేకాక ఫిలిప్పైన్స్ కొరియా మొదలైన ప్రాంతాల్లో అమెరికా అవలంబిస్తున్న వైఖరినిబట్టికూడా ఒక విషయం స్పష్టపడుతోంది. తూర్పుఆసియాలో అమెరికా తన ప్రాబల్యాన్ని వృద్ధిపరుచుకోడమే ప్రధానంగా తలుస్తోందికాని, అక్కడ ఆర్థికస్థితిని చక్కబరిచి సర్వవర్గాల మధ్యనూ శాంతి సమకూర్చడానికి యత్నించడం ప్రధానమని తలచడంలేదు.

తరువాత కమ్యూనిస్టుచీనాప్రభుత్వం పట్ల కామన్వెల్తుదేశాల వైఖరిపై చర్చ జరిగింది. ఈసందర్భంలో ఆస్ట్రేలియా, న్యూజీలాండ్, కెనడాలు ఇండియా బ్రిటన్‌ల తొందరపాటును తీవ్రంగా విమర్శించాయి. ఆస్ట్రేలియా కెనడాలు పసిఫిక్ ప్రాంత రక్షణవ్యవహారాల్లో బ్రిటన్‌కంటె అమెరికానే అనుసరించ గోరుతున్నవిషయం ఇదివరకే తేలిన విషయం. కాని బ్రిటన్ చీనాలోని తమ పదికోట్ల పౌనుల ఆస్తిపాస్తుల్ని కాపాడుకోడంకోసం కమ్యూనిస్టు చీనాప్రభుత్వాన్ని గుర్తించడం వివేకమని తలిచింది. అంతేకాక కమ్యూనిస్టులు సమీప ప్రాంతాల్లో (మలయా మొదలైన దేశాల్లో) జోక్యం చేసుకోకుండా సంరక్షించుకోడం కోసం బ్రిటన్ చీనాకమ్యూనిస్టుప్రభుత్వాన్ని గుర్తించిందని మలయాలోని బ్రిటిష్ కమిషనర్ జనరల్ మాల్కొం మాక్డొనాల్డ్ అన్నాడు. ఆసియాలో కమ్యూనిజంవ్యాప్తి నరికట్టడానికి బ్రిటన్‌కి ప్రజలక్షేమం ప్రధానం కాదనీ, వారి వలసల్ని కాపాడుకోడం ప్రధానమనీ తెలిసిన విషయమే. కమ్యూనిజం వ్యాప్తి నరికట్టడానికి ఇండియా మొదలయిన దేశాల ప్రాపుకోసం బ్రిటన్ ఆత్రుత పడుతోంది. మలయావిషయంలో బ్రిటిష్ పాలకులు దేశస్థులికి స్వపరిపాలన ఇవ్వడమే పరిష్కారమార్గమని పండిట్ నెహ్రూ చెప్పారనీ దీనివల్ల కమ్యూనిస్టులు బలపడగలరని మాల్కొం మాగొనాల్డు వాదించారనీ తెలుస్తోంది.

ఇండోచీనాచర్చలో కూడా పండిట్

(46 వ పేజీ చూడుడు)

★

# భారత రిపబ్లిక్

★



పండిట్ జవహర్లాల్ నెహ్రూ



సర్దార్ పటేల్



శ్రీమతి రాజకుమారి అమృతకౌర్



డా॥ శ్యామప్రసాద్ ముఖర్జీ



రఫీ అహ్మద్ కిద్వాయ్



సర్దార్ బల్దేవసింగ్



శ్రీ జయరాందాస్ దౌలత్ రాం



డా॥ బి. ఆర్. అంబేద్కర్



# కేంద్ర మంత్రివర్గం





మౌలానా అబుల్ కలాం అజాద్



డా॥ జాన్ మత్తయ్



శ్రీ కె. సి. నియోగి



శ్రీ యన్. జి. అయ్యంగార్



సత్యనారాయణ సిన్హా



శ్రీ జగజీవనరాం



డా॥ బి యస్. కేస్కర్



శ్రీ యన్. వి. గాడ్గిల్

# నేటి ప్రపంచం

(43 వ పేజీ తరువాయి)

నెహ్రూవైఖరిని మాక్డొనాల్డ్, ఆస్ట్రేలియన్ ప్రతినిధి, న్యూజీలాండ్ ప్రతినిధులు తీవ్రంగా విమర్శించారట. ఇండోచీనాలో ఫ్రెంచివారి నిరంకుశవిధానాన్నీ, బావోడాయ్ ప్రభుత్వానికి పరిపాలనా స్వాతంత్ర్యం ఇవ్వడంలో ఫ్రెంచిపాలకులు ప్రదర్శించిన సంకుచితదృక్పథాన్నీ పండిట్ నెహ్రూ విమర్శించారు. స్వపరిపాలనకు ఆసియావాసులు అనర్హులనే వాదాన్ని బ్రిటిష్ ఫ్రెంచిపాలకులు ఇంకా మానలేదు. ఇండోచీనాలో బావోడాయ్ ప్రభుత్వాన్ని గుర్తించడానికి పండిట్ నెహ్రూ తప్ప మిగతా కామన్వెల్తుదేశాల ప్రతినిధులంతా సమ్మతించారని తెలుస్తుంది. అయితే అన్నిదేశాలూ దానిని గుర్తించక పోవచ్చును. బావోడాయ్ ప్రభుత్వంతో ఫ్రెంచిపాలకులు చేసుకున్న ఒడంబడిక అమెరికన్ ప్రభుత్వానికీ, కెనడా ఆస్ట్రేలియా న్యూజీలాండ్ మొదలైన ప్రభుత్వాలకీ తృప్తికరంగానే ఉన్నాయి. కాని ఆ ఒడంబడికలోని షరతులు ఆసియావాసులకి గౌరవప్రదంగా లేవు. భారత ప్రభుత్వం ఆ ప్రభుత్వాన్ని ఇప్పుడిప్పుడే గుర్తించే అవకాశం కనిపించదు.

కమ్యూనిస్టుచీనా ప్రభుత్వంపట్ల వైఖరినిగురించి చర్చ జరిగినప్పుడు శత్రువుగా పరిగణించినందువల్ల ఆ ప్రభుత్వాన్ని దుర్బలపరిచినట్లవుతుందనీ, అప్పుడు చీనా రష్యాతో మరింత సన్నిహితంగా చేరి వ్యవహరించక తప్పనిసరి కాగలదనీ పండిట్ నెహ్రూ వాదించారు. అలాకాక పెకింగ్ ప్రభుత్వంతో సుహృద్భావంతో వాణిజ్య రాజకీయబాంధవ్యం ఏర్పరుచుకున్నట్లయితే ఆప్రభుత్వం రష్యాఅడుగుజాడల్లో మసిలే అగత్యం అంతగా ఉండదు. అయితే ఈవాదం ఆస్ట్రేలియావర్గానికి రుచించడం అసంభవం. ఈదేశాలు అమెరికాఅడుగుజాడల్లోనే నడుస్తాయి.

బర్మాప్రభుత్వానికి సహాయంచేసే విషయంలో కొన్ని నిర్ణయాలు జరిగాయి. సహాయం చెయ్యడానికి అన్ని ప్రతినిధి వర్గాలూ అంగీకరించాయి. కాని వారు తుది నిర్ణయం వారి ప్రభుత్వాలకు విడిచిపెట్టారు. ఇప్పటికి బ్రిటన్, ఇండియా, పాకిస్తాన్, సింహళదేశాలు ఏడున్నరకోట్ల రూపాయలు బర్మాప్రభుత్వానికివ్వడానికి నిర్ణయించాయి. బర్మా 20 కోట్ల రూపాయల సహాయం కోరింది. బర్మాలో శాంతి ఏర్పడ్డం భారతదేశానికికూడా అవసరం. భారతదేశానికి అవసరమైన బియ్యాన్ని సప్లై చెయ్యగలిగేది బర్మా ఒక్కటే. అందువల్ల బర్మాలో శాంతిస్థాపనకోసం భారత ప్రభుత్వం శ్రద్ధ వహించక తప్పదు.

అంతర్జాతీయవ్యవహారాల్లో పండిట్ నెహ్రూవిధానం ఆస్ట్రేలియాలో ఇటీవల విమర్శలకు గురయింది. ఈ విమర్శల్ని కొన్నిటిని చూస్తే, ఆసియావాసులపట్ల శ్వేతజాతులవారి వైఖరి సులువుగా బోధపడగలదు. "ఆసియాసమస్యలపట్ల పండిట్ నెహ్రూ స్వతంత్రవిధానం అవలంబించడమే కాదు. అతనివిధానంవల్ల ఆగ్నేయాసియాలో యూరోపియన్లకు అపకారంకూడా కలుగుతుంది" అని సిడ్నీ డెయిలీ టెలిగ్రాఫ్ పత్రిక వ్రాసింది. చీనాపట్ల అవలంబించే విధానంసందర్భంలో కామన్వెల్తులో చీలిక ఏర్పడుతున్నాయని సిడ్నీ మార్నింగ్ హెరాల్డ్ వ్రాసింది. అంతేకాదు. ఆసియాలో పండిట్ నెహ్రూవిధానం కేవలం భారతదేశఆహారసమస్యదృష్ట్యా నిర్ణయించబడినట్లు ఆ పత్రిక సూచించింది. కామన్వెల్తుదేశాలమధ్య సహకారం భగ్నమైపోతోందని ఆక్రోశిస్తున్న ఈ ఆస్ట్రేలియా బ్రిటన్‌కి తన గోధుమని సబబైన ధరలకి అమ్మడానికి నిరాకరిస్తోంది. వాస్తవానికి కామన్వెల్తుదేశాలమధ్య సహకారమే ఉంటే ఆస్ట్రేలియన్, కెనేడియన్ గోధుమపంటలు ఆసియాలో సగం దుర్భిక్షాన్ని నివారించగలిగేవి. కేవలం వర్తకం ప్రధానంగా పరిగణించి ప్రవర్తించే దేశాలమధ్య సహకారం సామాన్యస్థితిగతుల్లో సాధ్యంకాదు. కమ్యూనిస్టుముప్పు ఒకటి ఉండబట్టి ఆస్ట్రేలియా ఇండియాపట్ల మైత్రి వహించింది. అయినప్పటికీ ఈ మైత్రి ఆస్ట్రేలియాజాతివివక్షణల్ని నివారించలేక పోతోంది. ఆసియావాసుల్ని ఆస్ట్రేలియాలో స్థిరనివాసం ఏర్పరచుకోనివ్వకూడదని ఆస్ట్రేలియన్ రాజకీయపక్షాలన్నీ తీర్మానించుకున్నాయి.

ఇవన్నీ చూస్తే కామన్వెల్తు దేశాలమధ్య సహకారం వొట్టిబూటకమని తేలిపోతోంది. కామన్వెల్తు విదేశాంగమంత్రుల సమావేశంతోపాటు కొలంబోలో కామన్వెల్తు ఆర్థికవిషయసమావేశంకూడా జరిగింది. కామన్వెల్తుదేశాల ఆర్థిక స్థితిగతుల్ని ఈ సమావేశం సమీక్ష చేసింది. ఎటువంటి నిర్ణ

యాలూ జరగలేదు. కాని ముమ్ముందు ఆర్థిక విషయాల్లో కామన్వెల్తుదేశాలమధ్య ఒక ప్రణాళిక తయారుచెయ్యడానికి యత్నాలు జరగగలవని అమెరికన్ పత్రికలు సూచిస్తున్నాయి. ఆర్థికంగా దుస్థితిలో ఉన్న దేశాలన్నిటా ప్రభుత్వాలకు సహాయంచెయ్యడం నిమిత్తం అమెరికన్ అధ్యక్షుడు చేసిన ప్రణాళికవంటిదే కామన్వెల్తు దేశాల్లో బ్రిటన్ నాయకత్వంకింద ఒక ప్రణాళిక రూపొందగలదని అమెరికాలో కొందరు భావిస్తున్నారు.

పసిఫిక్ ప్రాంతాల రక్షణకు అట్లాంటిక్ పాక్టువంటిదే ఒక పాక్టు చేసుకునే విషయంలో భారతదేశం విముఖత చూపింది. ఇకనుంచి కామన్వెల్తువిదేశాంగమంత్రులు ఎప్పటికప్పుడు పరిస్థితుల్ని పరిశీలించి సంప్రదింపులు జరపడానికి గాను ఒక కార్యాలయం ఏర్పాటు కాగలదు. పసిఫిక్ పాక్టు లేని కొరతని కామన్వెల్తుదేశాలు త్వరలో తీర్చగలవని కొందరి అభిప్రాయం.

ఆర్థికంగా బలహీనంగా ఉన్న కామన్వెల్తుదేశాలకు సహాయం చెయ్యడానికి బ్రిటన్ తలపెట్టినట్లు అమెరికన్ పత్రికలు సూచిస్తున్నాయి. అటువంటిది అమలుజరిగే పక్షంలో బ్రిటన్‌కి మార్షల్ ఆర్థికసహాయాన్ని తరిగించాలని ఈ పత్రికలు వాదిస్తున్నాయి. స్టెర్లింగ్ బాకీల్ని తరిగించడానికి బ్రిటన్ అమెరికాలు ఏదో కుంభకోణం చెయ్యదల్చుకున్నాయని అనుమానం ఆసియాలో ప్రబలంగా ఉంది.

ఆర్థికంగా దుర్బలంగా ఉన్న దేశాలకి సహాయం చెయ్యడం నిమిత్తం అమెరికన్ కాంగ్రెస్‌లో ప్రవేశపెట్టడానికి రెండు శాసనాలు తయారవుతున్నాయి.

1. ఈ దేశాల్లో ప్రజారోగ్యం, విద్య, వ్యవసాయం, పరిశ్రమల అభివృద్ధికోసం అమెరికా నిపుణుల్ని పంపి పరికరాల్ని సప్లై చెయ్యడానికి ఒక శాసనం. 2. ఈ కార్యక్రమానికి 35 మిలియన్ల డాలర్లు ఖర్చు చెయ్యవలసివస్తుందని అంచనా వెయ్యబడింది. 2. ఆ దేశాల్లో అమెరికన్లు పెట్టుబడి పెట్టడానికి వీలుగా అమెరికన్ ప్రభుత్వం గారంటీలు ఇవ్వడానికి ఒక శాసనం.

35 మిలియన్ల డాలర్లనీ ఆసియా, ఆఫ్రికా, దక్షిణమెరికాలలో ఖర్చుపెట్టడానికి నిర్ణయించబడింది. దీన్నిబట్టే మనకి లభించగల నిపుణుల సహాయం ప్రమాణం ఎంత అల్పంగా ఉంటుందో గ్రహించవచ్చును. తరవాత అమెరికన్ల పెట్టుబడి సందర్భంలో అమెరికన్ ప్రభుత్వం గారంటీ లిస్తుంది. అంటే ఈ "వెనుకబడిన దేశాల్లో" అమెరికన్లు పెట్టుబడిపెట్టి ఆస్తులు సేకరించి పరిశ్రమలు స్థాపిస్తే, వానిని ఆ దేశాల ప్రభుత్వాలు స్వాధీనపరచుకోకుండా గారంటీ ఇస్తారు. ఆ దేశాల్లో, పరిశ్రమలు, వర్తకాలవల్ల ఆర్జించే లాభాల్ని అమెరికన్ ద్రవ్యంలో స్వదేశానికి తీసుకుపోడానికి గారంటీ ఇస్తారు. ఈ షరతులికి లోబడిన దేశాలకే అమెరికన్ల పెట్టుబడి వెడుతుంది.

నిపుణులసహాయాన్ని ఏర్పాటు చెయ్యడంనిమిత్తం ఏయేదేశాలకెటువంటి అవసరాలెంతెంత ఉంటాయో ఆ ప్రభుత్వాలు తెలపవలసిన అవసరం ఉంటుంది. ఈ అవసరాలేవో ప్రభుత్వాలు నిర్ణయించి తెలిపితే అమెరికన్లకి చాలదు.

బ్రిటిష్ కామన్వెల్తు దేశాలకి సంబంధించినంతవరకూ ఈవిషయాల్ని ఆ దేశాలన్నీ కలిసి నిర్ణయించుకోవాలి. అమెరికన్ ప్రభుత్వం కామన్వెల్తుదేశాలకు ప్రత్యేకించే ధనాన్ని ఏవిధంగా పంచుకోవాలి, ఏవిధంగా వినియోగించుకోవాలి అనే వివరాల్ని కామన్వెల్తు దేశాలన్నీ సంప్రదించుకుని నిర్ణయించాలి. కొలంబో సమావేశంలో ఈవిషయంకూడా చర్చించబడింది. ఒక ప్రణాళికకూడా తయారయిందని కొన్ని పత్రికలు తెలుపుతున్నాయి.

ఈ సందర్భంలోనే స్టెర్లింగ్ బాకీల ప్రసక్తికూడా వచ్చిందట. బ్రిటన్‌కి అమెరికా పంపుతున్న మార్షల్ ఆర్థికసహాయంలో కొంత వంతు భారతదేశం మొదలైన దేశాలకి బాకీలు తీర్చడానికి వినియోగపడుతోంది. ఇది అమెరికాకు బొత్తిగా ఇష్టంలేదు. అవంతుకి బ్రిటన్‌కి మార్షల్ సహాయాన్ని తగ్గించి, అమెరికా స్వయంగా పంపితే మంచిదని అమెరికన్ నాయకులు వాదిస్తున్నారు. దీనివల్ల బ్రిటన్ ఋణభారం తగ్గుతుంది. స్టెర్లింగ్ డాలర్ మారకంరేటు మార్పువల్ల భారతదేశానికిచ్చే డాలర్ వస్తువుల ఖరీదురూపంలో బ్రిటన్ బాకీని నూరింట 33 వంతులు తరిగించినట్లవుతుంది. స్టెర్లింగ్ బాకీల పరంగా భారతదేశానికి చెల్లింపు తగ్గించవలసిన అవసరం ఉందని బ్రిటిష్ ఆర్థికమంత్రి సర్ స్టాఫర్డ్ క్రిప్స్ చెప్పిన మాట బ్రిటిష్ఎన్నికల ప్రచారంకోసం చెప్పినది కాదు. అమెరికన్ కాంగ్రెస్‌లో శాసనప్రవేశంకోసం అమెరికన్లకి

చెప్పిన మాట. భారతదేశం మొదలైన స్టెర్లింగ్ దేశాల్లో మార్కెట్టులో అమెరికన్ వ్యాపారులు ప్రవేశించడానికి అవకాశ మిస్తున్నట్లు తెలపడానికి చెప్పినమాట అది.

ఆర్థికదుస్థితిలో ఉన్న దేశాలకి (ఆసియా ఆఫ్రికా, దక్షిణ అమెరికాలలోని దేశాలకి) అమెరికా సహాయం చెయ్యగలదని అమెరికన్ అధ్యక్షుడు ట్రూమన్ ప్రకటించినది మొట్టమొదట 1949 జనవరిలో. అప్పుడు ప్రపంచంలో కమ్యూనిజంవ్యాప్తిని అరికట్టడానికి తన కార్యక్రమాన్ని వివరిస్తూ నాలుగుముఖ్యాంశాల్ని ట్రూమన్ వివరించాడు. అందులో ఇది నాలుగోఅంశం.

తిరిగి1950 జనవరిలో అమెరికన్ కాంగ్రెస్ సమావేశంలో ప్రసంగిస్తూ ట్రూమన్ తన సందేశంలో ఈ రీతిగా చెప్పాడు: "ప్రపంచంలో ఆర్థికవ్యాపారం వ్యాపిస్తున్న కొద్దీ నానాటికి దారిద్ర్యంలో కుమిలిపోతున్న దేశాల్లో ప్రజల జీవనప్రమాణాన్ని వృద్ధిపరచవలసిన అవసరం ఉంటుంది. ఆ ప్రాంతాల్లో సహజసంపద అభివృద్ధిచేస్తే గాని యూరప్‌పు దానికి నిలువదు. మన (అమెరికా) ఆర్థికపరిస్థితి సుస్థిరంగా ఉండదు." దీన్ని బట్టి ఆసియా ఆఫ్రికాలలో దేశసంపదాభివృద్ధికి అమెరికన్లు చేసే సహాయం, ఆ దేశాల ప్రజలకోసం కాదనీ, యూరోపియన్ల కోసమేననీ స్పష్టపడుతోంది. పశ్చిమ యూరప్‌లోని దేశాలు ఆర్థికంగా విలీనం కావాలని వాదించడానికీ, ఆసియా యూరప్‌ల మధ్య సహకారం మైత్రీ అవసరమని వాదించడానికీ అమెరికన్ల ఆంతర్యం సుబోధకమే. ఆసియా సహజ సంపదల ఆధారంతో పశ్చిమయూరప్ పరిశ్రమలు వృద్ధిపొందినట్లయితే, అమెరికాపరిశ్రమల్లో ఉత్పత్తిచేసే వస్తువుల్ని కొనగలబలం యూరోపియన్లకి లభిస్తుంది. ఆసియా ఆఫ్రికాలు యూరప్ అమెరికాల నిగ్రహానుగ్రహాలమీద ఆధారపడి ఉండవలసివస్తుంది. అప్పుడు అమెరికాలో ఆర్థికమాంద్యం సంభవించే ప్రమాదం తప్పవచ్చును. నిరుద్యోగబాధనివారణ కావచ్చును. వారి తుపాకుల పరిశ్రమ చక్కగా వృద్ధి కావచ్చును. ఆసియావాసులకి అమెరికన్ పరిశ్రమలు కావలసినన్ని తుపాకులు మందుగుండు సామగ్రీ సప్లై చేస్తే, ఆసియా వాసులు మనసారా ఎన్నాళ్లయినా యుద్ధాలు చెయ్యవచ్చు.

[సూర్యనారాయణ]



'జానపహచాన్'లో నాయిక నర్గిస్

చిత్రసమీక్ష:

# జెమినీవారి "అపూర్వసహోదరులు"

[డైరెక్టర్ సి. పుల్లయ్య, కవి బలిజేపల్లి, సంగీతం రాజేశ్వరరావు.]

డ్యూమాస్ ప్రఖ్యాత ఆంగ్లనవల "కార్సికన్ బ్రదర్స్" కథావృత్తం ఆధారంగా జెమినీవారు తీసిన "అపూర్వ సహోదరగళ్" అనే తమిళచిత్రాన్ని తెలుగులోకి డబ్ చేశారు.

ఇది కవలసోదరుల కథ. భూపతిరాజుకు కవలపిల్లలు పుట్టినప్పుడు ఉత్సవానికి ఆహ్వానింపలేదన్న కోపంతో శత్రురాజు దండెత్తివచ్చి భూపతిరాజుని చంపి, కోటని నాశనం చేశాడు. కవలపిల్లల్ని ఒక డాక్టరు రక్షించి ఇద్దరిలో ఒకడిని తన బంధువులకీ, మరొకడిని భూపతిరాజవంశానికి విధేయుడైన వానికీ ఒప్పగించాడు. ఒకడు నగరంలోనూ ఒకడు అడవిలోనూ పెరుగుతారు. కాని ఒకనికి నెప్పి కలిగితే రెండోవానికి కూడా నెప్పి కలగడం ఈసోదరులికి విచిత్రలక్షణం. ఇద్దరూ పెరిగి పెద్దవాళ్లైన తరవాత డాక్టరు ఒకరి కొకర్ని ఎరుకపరచి వారి వంశానికి కలిగిన అపచారాన్ని తెలిపాడు. ఇద్దరూ పగతీర్చుకోడానికి కంకణం కట్టుకున్నారు. కాని నగరంలో పెరిగిన విజయుడు కాంచన (భానుమతి) అనే కన్యను ప్రేమించగా, విక్రముడు కూడా ఆమెనే ప్రేమిస్తాడు. ఇద్దరిమధ్యనూ కయ్యం పెరిగింది. కాని విక్రముణ్ని పెంచిన పెంపుడుతండ్రి తిరిగి వాళ్ల కర్తవ్యాన్ని జ్ఞప్తికి తెచ్చాడు. అన్నదమ్ములమధ్య కలహానికి తాను హేతువైనందువల్ల కాంచన వారిద్దరినుంచి పారిపోయి శత్రురాజుచేతిలో చిక్కింది. ఆమెని విడిపించడానికి వెళ్లిన విజయుడుకూడా చిక్కాడు. కాని డాక్టరుయుక్తివల్ల బైటపడ్డాడు. ఈలోగా విక్రముడు శత్రురాజుతో యుద్ధంచేసి చనిపోతాడు. విజయుడు జయిస్తాడు.

కవలసహోదరుల రెండుపాత్రల్నీ యం. కె. రాధ చక్కగా నిర్వహించాడు.

Regd. No. M. 4479.



Edited, Printed & Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press. 7 Thambu Chetty St., Madras.